

## ఇందులో:

* లెనిన్ ఉపదేశాల ననుసరించి
  నేటి రివిజినిజానికి ప్రతికూల పోరాటం
* కార్మికవర్గ పార్టీనిర్మాణం
  — స్టాలిన్
* పరిశ్రమలు జాతిపరం చేయడంపై కామ్రేడ్ లెనిన్
* సోవియట్ విదేశాంగ విధానంపై కామ్రేడ్ లెనిన్
* బూర్జువా జాతీయ పోకడలు

11

15-3-49

# జనత

"కామ్రేడ్స్! సందేహం వద్దు. భవిష్యత్తులో కూడా నేను శ్రామికవర్గం నిమిత్తం, శ్రామికవర్గ విప్లవం నిమిత్తం, ప్రపంచ కమ్యూనిజం నిమిత్తం, నా శక్తినీ, నా సామర్థ్యాలనూ, అవసరమైతే నా శరీరంలోని తుది బొట్టువరకూ రక్తాన్ని కూడా ధారవోస్తా."

— స్టాలిన్

[తన 50వ జన్మ దినోత్సవం సందర్భంలో ప్రపంచం నాలుగు మూలలనుంచీ వచ్చిన అభివందనాలకు స్టాలిన్ యిచ్చిన సమాధానం]



"మరణించినవారు మట్టిలో మాత్రమే మిగిలి ఉంటారు. కాని లెనిన్ మాత్రం విప్లవకారులున్న ప్రతి చోటా జీవించే ఉంటాడు. లెనిన్ భావాలూ మాటలూ విప్లవకారు లందరిలో కంటె ముఖ్యంగా కామ్రేడ్ స్టాలిన్‌లో ఎక్కువ సజీవంగా ఉన్నాయి. స్టాలిన్ — మన కాలపు లెనిన్..."

— హెన్రీ బార్బూసే

[సుప్రసిద్ధ ఫ్రెంచి రచయిత]




మార్క్సిస్టు సిద్ధాంత పక్షపత్రిక

సంచిక 11 | * 15–3–1949 * | వెల: ఎనిమిదణాలు

### లెనిన్ ఉపదేశాల ననుసరించి

# నేటి రివిజనిజానికి ప్రతికూల పోరాటం

కమ్యూనిస్టుపార్టీలలో చాలభాగం రివిజనిస్టు *పొరపాట్లు చేశాయి. వాటి కార్యకలాపాలలో రివిజనిస్టు ధోరణులు ప్రదర్శిత మయ్యాయి ఇటు వంటి పరిస్థితులలో ఈ యేడాది లెనిన్ దినోత్సవము మన కొక తీవ్రమైన హెచ్చరిక చేస్తోంది. రివిజనిజం ఏ రూపంలో వున్నా, దానిపై అదే పనిగా ఎడతెగని పోరాటాన్ని సాగించకుండా – మార్క్సిస్టు మూలసూత్రాలకు పెడర్థాలు చెప్పి మలిన పరచి రాజీ విధానానికి దారితీసే ప్రయత్నాల

---

* రివిజనిజం: మార్క్సిస్టు సూత్రాలకు అపవ్యాఖ్యానంచేసి, అసలు మార్క్సిజాన్నే సంస్కరించటానికి పూనుకోవడం. — సంపాదకవర్గం 'జనత'

నన్నింటినీ ఓడించకుండా – కార్మికవర్గం వర్గపోరాటపు మెళకువలనుగురించి సరిగ్గా అర్థం చేసుకొని అభివృద్ధి చేసుకోవడం సాధ్యపడదు. అవి సరియైన విప్లవ కార్యాచరణను కలిగి ఉండటం కూడా సాధ్యం కాదు.

రివిజనిజానికి వ్యతిరేకంగా లెనిన్ సాగించిన పోరాటాన్ని గురించి వ్రాస్తూ స్టాలిన్ యిలా చెప్పాడు.

> "లెనిన్ సిద్ధాంతాలయొక్క అసమాన విప్లవ స్వభావ తీవ్రతలను గురించి సాధారణంగా చాలమంది చెప్తూ ఉంటారు. ఇది ఖచ్చితంగా వాస్తవిక విషయమే. కాని లెనినిజంయొక్క యీ ప్రత్యేక స్వభావం రెండుకారణాలవలన ఏర్పడింది. మొదటిది: శ్రామికవర్గ విప్లవంలోనుండి లెనినిజం బయలుదేరడంవలన ఆ విప్లవంయొక్క స్వభావం ఆ సిద్ధాంతంపై బడటం సహజమే. రెండోది: పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా జరిగే పోరాటాన్ని జయప్రదంగా కొనసాగించాలంటే రెండో అంతర్జాతీయసమితికి చెందిన అవకాశవాద విద్రోహులతో తీవ్రతరమైన పోరాటాన్ని సాగించవలసివచ్చింది, ఇకముందుకూడా ఉంటుంది. ఈపోరాటంలో లెనినిజం అభివృద్ధి చెంది బలపడింది. మార్క్సు, ఎంగిల్సుల కాలానికీ లెనిన్ కాలానికి మధ్య దశలో యీ రెండవ అంతర్జాతీయ సమితికి చెందిన ద్రోహులయొక్క ఆధిపత్యం ఎక్కువగా ఉండేదన్న విషయాన్ని మరచిపోరాదు. అందువల్ల వారి విద్రోహకరమైన పంథాను ఎదుర్కొనడానికి నిర్దాక్షిణ్యంగా లెనిన్ చేయవలసివచ్చిన పోరాటం ప్రధానమైన లెనినిజంయొక్క కర్తవ్యాలలో ఒకటిగా పరిణమించుట తప్పనిసరి అయింది."
>
> — (ప్రోబ్లెమ్స్ ఆఫ్ లెనినిజం మాస్కో-ప్రతి 14 పేజి)

రివిజనిజానికి వ్యతిరేకంగా లెనిన్‌తోపాటు ఎడతెగని పోరాటాన్ని సాగించిన స్టాలిన్, ఆ తరువాత ట్రాట్స్కీ – బుఖారిన్ విద్రోహముఠాకు వ్యతిరేకంగా విప్లవ చాకచక్యంతో ఎడతెగని పోరాటాన్ని కొనసాగించాడు. ఈ ముఠా రష్యావిప్లవం అనంతరం బూర్జువా వర్గానికి దాసోహమని లొంగిపోవడానికి సిద్ధపడి, రష్యాలో సోషలిజం నిర్మించడాన్ని ప్రతిఘటించింది. మార్క్సిజానికి తమయొక్క తప్పుడు సిద్ధాంతాలను జేర్చి, మలినపరచే

యీ విద్రోహాలకు వ్యతిరేకంగా ఎడతెగని పోరాటం సాగించకపోయి ఉండి వున్నట్లయితే సోవియట్ యూనియన్‌లో సోషలిజాన్ని నిర్మించడం సాధ్యపడి ఉండేది కాదు. పెట్టుబడిదారీ రాజ్యాలు చేసిన దాడులనుండి సోవియట్ యూనియన్‌ను రక్షించుకోవడం సాధ్యమయ్యేదికాదు. హిట్లర్ సాయుధమూకలను ఓడించడం సాధ్యమయ్యేదికాదు.

ఈ అంతర్జాతీయ రివిజనిస్టులు రష్యావిప్లవంయొక్క అనుభవాన్ని, అంతర్జాతీయ శ్రామికవర్గానికి లెనిన్ యిచ్చిన నాయకత్వాన్ని ప్రధానంగా రష్యావిప్లవంయొక్క ప్రత్యేకలక్షణాంగా మాత్రమే చూడగలిగారు. రివిజనిజంయొక్క యీ నూతనతప్పుడురూపాన్ని ప్రచారంచేసే వారికి వ్యతిరేకంగానూ, రష్యావిప్లవం యిచ్చిన అనుభవాన్ని తిరస్కరించేవారికి వ్యతిరేకంగానూ పోరాడటానికి స్టాలిన్ ప్రపంచశ్రామిక వర్గానికి, ప్రజ్వరిల్లుతున్న కమ్యూనిస్టు పార్టీలకూ యీ క్రింది మహత్తరమైన సూత్రాన్ని అందించడం ద్వారా పదునైన ఆయుధాన్ని యివ్వగలిగాడు.

> "సామ్రాజ్యవాద యుగానికి, శ్రామిక వర్గ విప్లవానికి వర్తించే మార్క్సిస్టు సిద్ధాంతాలే 'లెనినిజం'. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే సర్వసామాన్యంగా శ్రామికవర్గ విప్లవంయొక్క సిద్ధాంతమూ, ఎత్తుగడలూ, ముఖ్యంగా శ్రామికవర్గ నియంతృత్వంయొక్క సిద్ధాంతమూ, ఎత్తుగడలూ—కలిసి లెనినిజం అవుతుంది."
>
> — (ప్రోబ్లెమ్స్ అఫ్ లెనినిజం పేజీ-14)

ఆ తరువాత రివిజనిజానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటం మార్క్సిజం—లెనినిజం పతాకం క్రిందనే జరిగింది. సరిగ్గా యీ సంస్కరణ తత్వంగల రివిజనిస్టు ధోరణిగల సోషల్ డెమాక్రటిక్ పార్టీలే శ్రామికవర్గ నియంతృత్వంయొక్క అవసరాన్నీ, శ్రామికవర్గ విప్లవాన్ని పెట్టుబడిదారీ విధానాన్ని కూలద్రోయడాన్నీ పార్టీయొక్క నాయకత్వం పాత్రనూ, ఏక దేశంలో సోషలిజాన్ని నిర్మించడాన్ని మొదలుగల వాటన్నింటితో సహా లెనిన్ ఉపదేశాలన్నింటినీ వదిలివేశాయి. లెనిన్ నాయకత్వానవున్న అంతర్జాతీయ కమ్యూనిస్టు సమితీ దాని సారథ్యంక్రింద నడుస్తున్న పార్టీలూ అవకాశవిధానానికి సోషల్ డెమాక్రట్ల విద్రోహానికి తాము వ్యతిరేకంగా జరుపుతున్న పోరాటంలో మార్క్సిజం—లెనినిజంనే దృఢంగా అంటిపెట్టుకొన్నాయి.

అలాంటి పోరాటం లెనిన్‌దే. పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగానూ, మార్క్సిజం–లెనినిజంకు అనుకూలంగానూ శ్రామికవర్గంలోని మెజారిటీని త్రిప్పలేమనే విషయాన్ని వారంతా గుర్తించారు.

ఇంత జరిగి నప్పటికీ చాలపార్టీలలో తిరిగి రివిజనిస్టు ధోరణులు – కొన్ని సందర్భాలలో ప్రమాదపరిస్థితులకు దారితీసేటంతగాకూడా, తలెత్తాయి. ఫాసిస్టు ప్రతికూల యుద్ధం ముగియడంతోటే అదివరకంతా కూడ బెట్టుకొని ఉన్న రివిజనిస్టు ప్రభావంయొక్క ఫలితమంతా ఒక్కసారి బయట పడింది. కొన్ని పార్టీలలో కొంతమంది నాయకులు సోషలిజాన్ని నూతన "జాతీయ" రూపాలలో ప్రచారం చేస్తున్నామనే ముసుగు క్రింద మార్క్సిజం – లెనినిజం యొక్క మూలసూత్రాలకే తిలోదకాలు వదిలి, బహిరంగంగానే రివిజనిస్టు ధోరణులను అనుసరించారు. ఈ విధంగా యూరప్‌లోని చాల పార్టీల నాయకులు శ్రామికవర్గ నియంతృత్వం యొక్క అవసరం ఇంక లేదనీ, అదంతా పాతబడిపోయిన వెనకటి దృక్పథమనీ ప్రకటనలుచేయడం జరిగింది. ఇది రాజ్యాంగ యంత్రాన్ని గురించి మార్క్సిస్టు ఉపదేశాన్ని పూర్తిగా త్రోసివేయడం తప్ప మరొకటి కాదు. బహుశా కాట్స్కీ అనంతరం యిలాంటి పనిని యింత బహిరంగంగా ఎవరూచేయ సాహసించలేదనే చెప్పాలి. రాజ్యాంగ యంత్రాన్ని గురించి మార్క్సిస్టు సిద్ధాంతాన్ని రక్షించేందుకుగాను లెనిన్ "రాజ్యాంగ యంత్రం – విప్లవం", "శ్రామికవర్గ విప్లవమూ – ద్రోహి కాట్స్కీ" అనే రెండు ప్రమాణ గ్రంథాలను రచించాడు. రెండో గ్రంథంలో శ్రామికవర్గ నియంతృత్వం యొక్క అవసరాన్ని గురించి వివరించుతూ దానిని సమర్థించాడు. శ్రామికవర్గ విప్లవానికి సాధనంగా శ్రామికవర్గ నియంతృత్వం అవసరం లేదని త్రోసిపుచ్చిన కాట్స్కీనీ విద్రోహి అని ఖండించాడు. తాత్కాలిక రాజ్యాంగం ఏ స్వరూపంలో ఉన్నప్పటికీ, శ్రామికవర్గ నియంతృత్వం లేనిదే శ్రామికవర్గ విప్లవమూ లేదు, సోషలిజమూ లేదు – మార్క్సిస్టు – లెనినిస్టు ఉపదేశంలోని కీలకమే అది.

లెనినిజాన్ని స్టాలిన్ బ్రహ్మాండంగా నిర్వచించాడు:

"సామాన్యంగా శ్రామికవర్గవిప్లవంయొక్క సిద్ధాంతమూ, ఎత్తుగడలూ ముఖ్యంగా శ్రామికవర్గ నియంతృత్వంయొక్క సిద్ధాంతమూ, ఎత్తుగడలూ లెనినిజం అవుతుంది".

కాబట్టి శ్రామికవర్గ నియంతృత్వాన్ని నిరాకరించడమంటే లెనినిజాన్ని, స్టాలిన్‌యొక్క ఉపదేశాల నన్నింటినీ పరిత్యతంగా నిరాకరించడమే అవుతుంది. అయినప్పటికీ కమ్యూనిస్టు పార్టీల నాయకులలో అనేకమంది దీనినే ప్రచారం చేశారు. అయితే ఇతర సమస్యలలో వారనుకరించిన అవకాశధోరణులు బట్టబయలు చేయడం మూలంగా వీరిలో చాలమంది నేడు ఆ యా పార్టీలలోని ప్రముఖస్థానాలనుండి తొలగించబడ్డారు. ఒక పార్టీ నాయకత్వం యీ విధంగా శ్రామికవర్గ నియంతృత్వ సిద్ధాంతాన్ని నిరాకరించడాన్ని ఆమోదించింది. లెనినిజాన్ని బహిరంగంగా నిరాకరించడంలాంటి ఘోరమైన వాదనను గురించి అది యింతవరకు ఆత్మవిమర్శన చేసుకొని సవరించుకోనేలేదు.

రివిజనిజం దాని సహజ పరిణామాన్ననుసరించి కొన్ని సందర్భాలలో పార్టీ బూర్జువా జాతీయతత్వ కూటమిలోకి వెళ్ళిపోయేవరకూ చేసి సోవియట్ వ్యతిరేకతకుకూడా దారితీయించింది. యుగోస్లోవియాలో టిటో-కార్డెలీముఠా అనుసరించిన పంథాచివరకు బూర్జువా జాతీయ దురభిమాన సిద్ధాంతానికి దిగజారిపోయింది. ఈ విధంగా రివిజనిజం తన సహజ పరిణామదశకు - శత్రుకూటమిలోకి వెళ్ళిపోయేందుకు సహితం దారితీసింది.

యుగోస్లోవియా నాయకత్వం పార్టీని రద్దుచేసి, ప్రజాసంఘటన (పీపుల్సుఫ్రంటు) లో కలిపివేసే పాలసీని అనుసరించింది. ఈ విధంగా యుగోస్లోవియా నాయకత్వం పార్టీయొక్క నాయకత్వ పాత్రనూ, శ్రామికవర్గ అగ్రగామిపాత్రనూ పూర్తిగా నిరాకరించడం జరిగింది. యుగోస్లోవియాపార్టీ ప్రజాస్వామిక ప్రజాతంత్ర దశనుండి సోషలిజానికి పరివర్తన చెందడాన్ని వర్గేతరదృష్టితో వీక్షించడాన్ని ప్రారంభించారు. ఇది నిజానికి కులక్‌లతోనూ, ధనికవర్గాలతోనూ ఏకం అవడానికి దారితీసి, చివరకు యుగోస్లోవియా మామూలు బూర్జువా రిపబ్లిక్‌గా తయారవడంతో అంతమవుతుంది. దాని నంతటని బట్టబయలు చేయంగానే పెట్టుబడిదారీ విధానంయొక్క అవశేషాలనూ, కులక్ (ధనికరైతు) వర్గాన్నీ రద్దుచేస్తామనే ప్రకటనతో యుగోస్లోవియా ప్రభుత్వం బయటకొచ్చింది. అయితే దీని కవసరమైన గట్టి ఆర్థిక నిర్మాణాన్ని ఏర్పరచకుండానే తొందరపడి యీ ప్రకటన చేసింది. ఇది ఆచరణలో బుఖారిన్‌ముఠా అనుసరించిన పంథాయే అవుతుంది. బుఖారిన్

గ్రూపు ధనిక రైతులతో వర్గ సామరస్యాన్ని ప్రతిపాదించింది. ధనిక రైతులే సోషలిజం నిర్మాణానికి అనుకూలపడతారని ప్రకటించింది. ఈ విధంగా కార్మికవర్గమూ, కార్మికవర్గ రాజ్యాంగ యంత్రమూ పెట్టుబడిదారీ శక్తులతో పోరాడకుండా చేసింది. కార్మికవర్గమూ, కార్మికవర్గ రాజ్యాంగయంత్రమూ కష్టజీవులైన రైతులపైనా, వ్యవసాయ కూలీలపైనా ఆధారపడి వారి సహకార సంపత్తులతో తన పోరాటాన్ని కొనసాగించకుండా చేసింది.

చిట్టచివరకు యుగోస్లోవియా నాయకత్వం సోవియట్ వ్యతిరేక వైఖరినీ, పాలసీనీ చేబట్టి దానిని "ఒక దేశంలో సోషలిజాన్ని నిర్మించడం" అనే మోసపు ముసుగుక్రింద కప్పివేయడానికి ప్రయత్నించింది. ఒక దేశంలో సోషలిజాన్ని నిర్మించే అవకాశాన్ని ప్రతిపాదించే లెనినిస్టు – స్టాలినిస్టు సిద్ధాంతానికే యుగోస్లోవియా నాయకత్వం వక్రభాష్యం కల్పించింది. పెట్టుబడిదారీ రాజ్యాల ప్రతికూలత ఉన్నప్పటికీ వాటి సహాయాన్ని తీసుకోకుండా రష్యాలాంటి ఒక దేశంలో స్వతంత్రంగా సోషలిజాన్ని నిర్మించవచ్చుననీ, అభివృద్ధిఅయిన యితర యూరప్ దేశాలలో శ్రామికవర్గ విప్లవం జయప్రదం అయ్యేవరకూ వేచియుండ నవసరంలేదనీ లెనినిస్టు – స్టాలినిస్టు సిద్ధాంతం తెలియచేసింది. దీనికి టిటో మురాపెడర్థాలను కల్పించింది. ప్రస్తుత పరిస్థితులలో – అమెరికా తన దుష్టహస్తాన్ని ప్రతిచోటుకూ చాస్తున్నా, యీ రోజులలో యుగోస్లోవియాలాంటి దేశం మహత్తరమైన సోవియట్ యూనియన్ యెడల యితర ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలయెడా వ్యతిరేకవైఖరిని అవలంబించుతూ సోషలిజానికీ, అమెరికా సామ్రాజ్యవాదానికీ మధ్య నాటకమాడుతూ అంటే మార్షల్ సహాయం పొందే దేశంగా తయారయి స్వతంత్రంగా సోషలిజాన్ని నిర్మించుతుందట. ఇక్కడ రివిజినిజం మార్క్సిస్టు సూత్రాలను ఒకదాని తరువాత ఒకదానికి స్వస్తి చెప్పుతూ శత్రుకూటమిలోకే వెళ్ళిపోయింది. సోవియట్ వ్యతిరేక బూర్జువా సిద్ధాంతంగా తయారయింది. చివరకు రివిజినిజం కార్మికవర్గంయొక్క అంతర్జాతీయ సహకారాన్నీ, దాని అగ్రగామిఅయిన కమ్యూనిస్టు పార్టీలమధ్య పరస్పర సహకారాన్నీ నిరాకరించి ఆపైన అంతర్జాతీయ శ్రామికవర్గానికీ సోషలిజానికి దుర్గమైన సోవియట్ యూనియన్ యెడల సిగ్గువిడచి బహిరంగంగా విరోధవైఖరిని అవలంబించింది.

ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాలలోని కొన్నిపార్టీల నాయకులు రివిజనిస్టు ధోరణిని రెండుపద్ధతులలో అనుసరించారు. ఒకటి: సోవియట్ యూనియన్ నిర్వహించే పాత్రను తక్కువ అంచనావేయడం, సోవియట్ యూనియన్‌యొక్క నాయకత్వపాత్రను నిజంగా అర్థంచేసుకొనక పక్షం లోనే ప్రజాస్వామిక ప్రజాతంత్రరాజ్యాలు సోషలిజం వైపుకు పురోగమిస్తూ, తమయొక్క స్వాతంత్ర్యాన్ని కాపాడుకోగలవనే విషయాన్ని మరచిపోవడం, బూర్జువా - జాతీయతత్వాన్ని అలవరచుకోవడం. రెండు: సోషలిజంకోసం జరిగే పోరాటవివిధదశలలో రైతాంగసమస్యను గురించిన మార్క్సిస్టు - లెనినిస్టు దృక్పథాన్ని మరచిపోయారు. ప్రజాస్వామిక ప్రజాతంత్ర ప్రభుత్వాలు స్థాపించబడినతరువాత వర్గపోరాటం తగ్గదు సరిగదా మరింత తీవ్రతరమై, నూతన రూపాలను పొందుతుందనే విషయాన్ని మరచిపోయారు. అంతేకాదు; ఇందుమూలంగా దోపిడీదారుల వ్యతిరేకతను మట్టుబెట్టి, సోషలిజాన్ని సాధించేందుకు జరిగే పోరాటములో రాజ్యాంగ యంత్రాన్ని సరిగ్గా, విప్లవకరంగా వినియోగించుకోవలసి ఉంటుందనే విషయాన్ని మరచిపోయారు. సోషలిజముకోసము జరిగే పోరాటములో రాజ్యాంగ యంత్రము ఒక నిశితమైన ఆయుధంగా వినియోగపడాలంటే శ్రామికవర్గం దేశంలో అగ్రగామిదళంగా వుండవలసిన అవసరాన్ని మరచిపోయారు.

పెట్టుబడిదారీ దేశాలలోని కొన్ని పార్టీలలో రివిజనిజం మరొక రూపాన్ని తీసుకొంది. అక్కడ సోషల్ డెమోక్రట్లవర్గ పాత్రను సరిగా అర్థం చేసుకోలేకపోవడం అందు మూలంగా దానియొక్క విద్రోహాన్ని తూర్పార పట్టలేక పోవడం; పెట్టుబడిదారీ రాజ్యాల వర్గవైఖరిని అర్థం చేసుకోలేక పోవడము. సోషల్ డెమోక్రేట్లు అధికారంలోవున్నా, ఆరాజ్యాల వర్గ వైఖరి అంతే ననే విషయాన్ని గమనించకపోవడం, అందు మూలంగా పరిశ్రమలను జాతిపరం చేస్తున్నామనే పేరుతో జరిపే బూటకపు నాటకాన్ని గమనించ లేక దానికి సాయపడటానికి ఉబలాట పడటం, ఉత్పత్తిని పెంచాలనే పేరుతో కార్మికవర్గ సమ్మెపోరాటాలను త్యజించి, వర్గసామరస్యం కోసం బహిరంగంగా పిలుపు నిచ్చే స్థితికి దిగజారడము - ఇవి రివిజనిజము తీసుకుంటున్న రూపాలు.

నేటికాలపు రివిజనిస్టు ధోరణి ఏ విధంగా ఆచరణలో మామూలు సోషల్ డెమాక్రసీతో కలసిపోయి ప్రజానీకము యొక్క దైనందినపోరాటాలను సహితము విస్మరించుతున్నాదో, మనము ఇక్కడ చూడగలము.

మరికొన్ని పార్టీలలో రివిజనిజము యొక్క ఇంకొక లక్షణము బయట పడింది. అదేమంటే ఆత్మవిమర్శన అనే విప్లవకరసూత్రానికి స్వస్తిచెప్పడం, నాయకత్వముయొక్క తప్పులను ఏదో ఒకరూపములో కప్పిపుచ్చడము, పార్టీకార్యకలాపాలలో ప్రత్యక్షముగా గడించిన అనుభవాన్నుండీ పార్టీ కేడరు గుణపాఠాలను నేర్చుకోనకుండా ఆటంకపరచి ఆ విధముగా సమిష్టి ఆలోచనా విధానాన్ని విచ్ఛిన్న పరచడము.

రెండో అంతర్జాతీయత సమితికి చెందిన పార్టీలు ఆత్మవిమర్శయెడల అనుసరించే వైఖరిని గురించి వ్రాస్తూ స్టాలిన్ యిలా అన్నాడు.

> "రెండవ అంతర్జాతీయ సంస్థకు చెందిన పార్టీలకు ఆత్మ విమర్శన అంటే ఎంతభయమో, వారు తమ తప్పులను భద్రముగా మరుగపరచి, ప్రధాన సమస్యలను దాటవేస్తూ, అంతా బాగానే ఉన్నట్లు పైకి ప్రదర్శించి, లోపాలను కప్పిపెట్టుకొని వారు ఆడే దొంగనాటకములను గురించి నేను ఎక్కువగా చెప్పనవసరంలేదు. ఈ విధముగా లోపాలను దిద్దుకోనకుండా ఉంటే సజీవమైన ఆలోచనాశక్తికూడా నశించిపార్టీయొక్క విప్లవశిక్షణమే నిరోధించ బడుతుంది. అందువల్ల యీ అలవాట్లను లెనిన్ నిర్దాక్షిణ్యాముగా ఖండించాడు. శ్రామికవర్గ పార్టీలలో జరుగవలసిన ఆత్మవిమర్శనను గురించి లెనిన్ తన "అతివాద కమ్యూనిజము చిన్నబిడ్డజబ్బు" అన్న గ్రంథములో యీ విధముగా వ్రాశాడు:
>
> "ఒక రాజకీయ పార్టీయొక్క నిజాయితీని పరీక్షించడానికీ, తన వర్గముపట్ల కష్టజీవులైన ప్రజాసామాన్యముపట్ల ఆచరణలో తనకున్న బాధ్యతల నే విధముగా నెరవేరుస్తుందో నిర్ణయించడానికీ ఆపార్టీ తాను చేసే తప్పులయెడల అవలంబించే వైఖరియే అందుకు ప్రధానమైన కొలబద్దగా ఉంటుంది. చేసిన తప్పులను నిస్సంకోచముగా అంగీకరించడము ఆ తప్పు జరగడానికి కారణా లేవో పరిశోధించడం అందుకు ఏ యే పరి

స్థితులు దారితీశాయో పరిశీలించడము, ఆ తప్పులను సవరించుకోడానికి అవలంబించవలసిన పద్ధతులను గురించి క్షుణ్ణముగా చర్చించడము, -- ఇదే నిజాయితీగల పార్టీయొక్క లక్షణము. సక్రమముగా తన బాధ్యతల నిర్వహించడానికీ, తన వర్గానికీ, ప్రజలకూ సరియైన శిక్షణ ఇచ్చి, తర్ఫీదు చేయడానికీ ఇదొక్కటే మార్గము."

(ప్రోబ్లెమ్స్ ఆఫ్ లెనినిజం పే. 21—25)

ఈ దశలో ఆత్మవిమర్శన పార్టీకీ, వర్గానికి శిక్షణగరిపే ఆయుధంగా వినియోగపడేందుకు బదులు నాయకత్వానికీ, పార్టీ సామాన్యసభ్యులకు మధ్య సమస్యగా పరిణమించింది. ఆత్మవిమర్శన విషయంలో రివిజనిస్టు ధోరణి యీవిధంగా ప్రదర్శితమైంది. విప్లవయుతమైన ఆత్మవిమర్శన పార్టీ యొక్క పేరు ప్రతిష్ఠలను యితరపార్టీలవారిముందు కొంచెపరుస్తుందని తప్పుగా చెప్పబడింది. అంతేగాదు; పార్టీ, పార్టీనాయకత్వం చేసిన తప్పులను గురించి నిస్సంకోచంగా ఆత్మవిమర్శన చేసుకోవడమువల్ల పార్టీలో విశ్వాసం సడలింపు అయి విచ్ఛిన్నానికి దారితీస్తుందని తలచబడింది. పార్టీలోని సామాన్యసభ్యులు అంతగా చైతన్యవంతులు కారనీ, అందువలన పార్టీ నాయకత్వము ఎన్నడూ తప్పుచేయదనే భావము వారిలో ఉంటేనేగాని వారి పనిచేయడము సాధ్యముకాదనీ భావించబడింది. ఇది నిజానికి దేనిని తెలియజేస్తుంది? పార్టీలోని సామాన్యసభ్యులు తనను విమర్శించడమంటే పార్టీనాయకత్వం ఎంతగా భయపడుతుందో స్పష్టం చేయడంలేదా?

ఆత్మవిమర్శన అనే సూత్రాన్ని యీవిధంగా త్యజించడంమూలంగా మరొక ప్రమాదంకూడా వాటిల్లింది. అదే పనిగా తప్పులు చేయడం మూలంగా పార్టీపంథాలో అకస్మాత్తుగా వచ్చిన మార్పులను దాచడమూ, ఆ తప్పులు, వెనకటి పంథాను కొనసాగించడము మూలంగా వచ్చిన పొరపాటు మాత్రమేనని సమర్థించుకొని చెప్పుకోవడము సంభవించింది. ఈ విధంగా చేయడము మూలంగా పార్టీ నాయకత్వము పార్టీ పంథాలో ఎందుకు మార్పు రావలసివచ్చిందీ -- ఎక్కడనుండి మార్పుచేయవలసి వచ్చిందీ -- వెనకటి పంథాను ఇంకొంచెము ముందుగానే మార్పుచేసుకొని ఉండవలసిందీ -- లేనిదీ -- గతంలో తప్పులున్నదీ -- లేనిదీ మొదలు గాగల

విషయాలనన్నింటినీ పార్టీ సభ్యులకు ఖచితంగా వివరించిచెప్పే బాధ్యత నుండి నాయకత్వం తప్పించుకోడానికి, ఆత్మవిమర్శనకు స్వస్తిచెప్పడానికి అవకాశం లభించింది. ఈవిధంగా పార్టీ సభ్యులవద్ద తప్పులు దాచబడ్డాయి. అదేవిధంగా పార్టీపంథాలో వచ్చిన మార్పులను సహితం కప్పిపెట్టేవారు తమ కార్యక్రమాన్ని ఇంత పాతధోరణిలో కొనసాగించడము పార్టీ నాయకత్వానికి అసంభవముగాబట్టి నూతన పరిస్థితులకు తగినట్లు పార్టీ పంథాను మార్పుచేసినట్లుగా ప్రకటించడము జరిగేది. వెనకటి విధానాన్నే "కొనసాగిస్తున్నా"మని నొక్కి వివరించడమంటే నాయకత్వము ఎన్నడూ తప్పులు చేయదనే సిద్ధాంతాన్ని నగ్నంగా చెప్పుకోవడమే అవుతుంది. ఆత్మవిమర్శనను పూర్తిగా విసర్జించడమే అవుతుంది.

అమెరికాలో బ్రౌడర్ రివిజనిజాన్ని దాని సహజ పరిణామదశవరకూ అంటే పార్టీయొక్క నాయకత్వ పాత్రను నిరాకరించడం, పార్టీని రద్దు చేయడం, శ్రామికవర్గాన్ని బూర్జువాపార్టీలలో కలిసిపొమ్మని చెప్పడం వరకూ తీసుకొని వెళ్ళాడు. మార్క్సిస్టు మూలసూత్రాలలో బ్రౌడర్ త్యజించనిది ఒక్కటీ లేదనే చెప్పాలి. అతడుకూడా టిటోవలెనే పెట్టుబడిదారీ సోషలిస్టు ప్రపంచాలు రెండూ ఒకదానిప్రక్క ఒకటి వుండవచ్చుననే సరియైన సూత్రాన్ని అపార్థం చేసుకోవడంపై తన రివిజనిజాన్ని ఆధారం చేసుకోడానికి ప్రయత్నించాడు. అమెరికాలో వివిధ వర్గాలమధ్య శాశ్వతంగా శాంతి వుంటుందని అనడానికి యీ సూత్రాన్ని అతడు వినియోగించాడు. అంటే అమెరికా కార్మికవర్గం పెట్టుబడిదారుల శాశ్వత బానిసత్వాన్ని అంగీకరించడమన్న మాట. రక్తతృష్ణగల అమెరికా సామ్రాజ్యవాదుల ఉద్దేశాలు శాంతియుతమైనవని సర్టిఫికెట్టు యివ్వడమన్న మాట. క్లుప్తంలో చెప్పాలంటే అతనిపంథా కార్మికవర్గానికి, సోవియట్ యూనియన్‌కూ అంతర్జాతీయ శత్రువులైన వారికి దాసోహమని ద్రోహంచేయడానికి దారితీస్తుంది.

ఈ రివిజనిస్టు సూత్రాలలో కొన్ని 1948 మేలో ఆస్ట్రేలియా కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసుకు సమర్పించిన ప్రధాన రాజకీయ రిపోర్టులో స్పష్టంగా ప్రదర్శితమయ్యాయి. ఆ రిపోర్టు శ్రామికవర్గ నియంతృత్వం అనే సిద్ధాంతానికి బహిరంగంగానే తిలోదకాలిచ్చింది. అంటే రాజ్యంలో

శ్రామికవర్గానికి అగ్రగామి పాత్రను నిరాకరించి టిటోముఠా తయారు చేసిన అనేక మార్క్సిస్టు వ్యతిరేకసూత్రాలను ఆమోదించింది. ఉదాహరణకు దేశంలోని యావత్తు ప్రజానీకంయొక్క అధికారానికి పీపుల్సు ఫ్రంట్ ప్రాతినిధ్యం వహిస్తుందనీ అదే సోషలిస్టు సమాజంగా పరిణతి చెందుతుందని తెలియజేశారు.

శ్రామికవర్గ పోరాటాలను ప్రత్యేక జాతీయ రూపాలద్వారా జరపాలనే పేరుతోనూ, మార్క్సిజం - లెనినిజం ఆయాదేశాల ప్రత్యేక పరిస్థితులకు అన్వయించుతున్నామనే పేరుతోనూ ఈ పెడత్రోవలన్నీ (డీవియేషన్లు) యీ రివిజనిస్టు ధోరణులన్నీ బయలుదేరాయి. "మార్క్సిజం ఒక మూఢ సిద్ధాంతం కాదు. అది కార్యాచరణకు మార్గదర్శి" అనే విప్లవసత్యానికి సహితం మార్క్సిస్టు సూత్రాలకు విరుద్ధమైన రాజకీయాలను సమర్థించేందుకు వక్రభాష్యం చెప్పబడింది. మార్క్సిజాన్ని ప్రత్యేకపరిస్థితులకు అన్వయించుతున్నామనే ముసుగుక్రింద యీ రివిజనిస్టు ధోరణులను చెలామణి చేశారు. ఈవిధంగా నిజానికి వీరు మార్క్సిజాన్ని అన్వయింప జేయక పోగా దానిని త్యజించారు. మార్క్సిస్టు సూత్రాలను నిరాకరించారు.

ఈ రివిజనిస్టు ధోరణులు చాల అభివృద్ధిచెందిన పార్టీలలో సహితం ప్రవేశించాయి. మార్క్సిజం - లెనినిజంయెడల గాఢమైన భక్తి విశ్వాసాలను గలిగి, ఆ మహాదాశయంకోసం దృఢతరమైన పోరాటాన్ని సలిపే యోధులైన నాయకులలో కూడా యీ ధోరణులు ప్రదర్శితమయ్యాయి. ఈవిధంగా జరగడం మితవాద సంస్కరణతత్వంవైపుకూ, బూర్జువా జాతీయత వైపుకూ పార్టీని మొగ్గించడంతప్ప వేరుగాదు. బూర్జువా జాతీయత అంటే ఆయా దేశాలలో శ్రామికవర్గ ఉద్యమాలను బూర్జువావర్గ అవసరాల నిమిత్తం వినియోగించడానికి ప్రయత్నించడం తప్ప వేరొకటి కాదు. వివిధ పార్టీలలో ద్యోతకమవుతున్న రివిజనిస్టు ధోరణులకూ, పొరపాట్లకూ వెనుక ఒక విషయంమాత్రం వుంది. అదేమంటే వారు ప్రతిదేశంలోనూ కార్మికవర్గ ఉద్యమాలను ఆ దేశంలోని బూర్జువావర్గ అవసరాలకు సరిపోయేటట్లు నడపడానికి ప్రయత్నించడం స్పష్టంగా కనపడుతుంది. మార్క్సిజాన్ని అన్వయింపజేయడానికి ప్రత్యేక జాతీయ స్వరూపాలను పరిశోధించడానికి బదులు కొన్ని పార్టీలు ముఖ్యంగా అమెరికా కమ్యూనిస్టుపార్టీ

భారత కమ్యూనిస్టుపార్టీ తమతమ దేశాలలోని కార్మికవర్గ పోరాటాలను ఆ దేశాల బూర్జువావర్గ అవసరాలకు అనుగుణ్యంగా వుండేటట్లు ప్రత్యేక జాతీయ స్వరూపాలను మాత్రం అభివృద్ధిచేయడం జరిగింది.

అంతర్జాతీయంగా గోచరమవుతున్న యీ రివిజనిజాన్ని అర్థం చేసుకొనేటప్పుడు పెట్టుబడిదారీ దేశాలలోని అన్నిపార్టీలపై దీనియొక్క ఫలితం ఒకేవిధంగా సమానముగా పడలేదనే విషయాన్ని మరచిపోరాదు. కొన్ని పార్టీలలో రివిజనిస్టు పొరపాట్లు జరిగాయి. మరికొన్ని పార్టీలలో రివిజనిజం ఒక పాలసీ కిందనే తయారయింది. మొదటిరకం పార్టీలు రివిజనిస్టు పొరపాట్లు చేసినప్పటికీ అవి మహత్తరమైన విప్లవ కృషిని చేశాయి. అవి ఎల్లప్పుడూ ఇదివరకూ యిప్పుడూకూడా ప్రపంచ శ్రామికవర్గ ఉద్యమానికి అగ్రగామిగా ఉంటూనే ఉన్నాయి. ఈ పార్టీలు కొనసాగించిన దీర్ఘమైన విప్లవకరమైన పోరాటాన్ని సమీక్షచేయడం ప్రస్తుతంఅప్రస్తుతం. రివిజనిజాన్ని ఒక అంతర్జాతీయ పోకడగానూ, దాని సాంఘిక పునాదులనూ అర్థముచేసుకొనేందుకు మాత్రమే నేడు మనం ప్రయత్నించుతున్నాం.

ఇండియాలోని రివిజనిజంలో యితరచోట్ల ప్రదర్శితమైన రివిజనిస్టు ధోరణులలోని అత్యంత దుర్గుణాలన్నీ యిమిడిఉన్నాయి.

అవి: 1. కార్మికవర్గ నియంతృత్వసిద్ధాంతాన్ని త్యజించడానికి సిగ్గులేకుండా సమ్మతించడం 2. పార్టీనిర్మాణంలో లెనినిస్టు సూత్రాలకు స్వస్తిచెప్పడం 3. ప్రజాతంత్రపోరాటంలో కార్మికవర్గానికి గల అగ్రగామిపాత్రనూ, పార్టీకిగల నాయకత్వపాత్రనూ నిరాకరించడం 4. భారతదేశ పరిస్థితికిగల ప్రత్యేకలక్షణాలకు అనుగుణ్యంగా అనే పేరుతో బూర్జువా జాతీయతను అంగీకరించడం, దానితోక పట్టుకొని వెళ్ళడం 5. ప్రపంచసోషలిజానికి దుర్గమైన సోవియట్ యూనియన్ అంతర్జాతీయపాత్రను సరిగా అంచనా వేయలేకపోవడము 6. బూర్జువావర్గానికి ప్రతికూలంగా జనసామాన్యము స్వతంత్రముగా జరిపే అన్ని ఆర్థిక రాజకీయ పోరాటాలకూ నాయకత్వం వహించడానికిగాని, వాటిని అంగీకరించి ప్రోత్సహించడానికిగాని సర్వసామాన్యంగా సందేహించడం 7. మార్క్సిజం - లెనినిజంయెడల ఉద్దేశ్యపూర్వకంగా ఉపేక్షభావాన్ని ప్రదర్శించడం. మార్క్సిస్టు సిద్ధాం

తాన్ని "అస్పష్టమైన మార్క్సిజం" అనే పేరుతో పి. సి. జోషి ఖండించి, దాని అధ్యయనసంఘాల సభ్యులలో ఉపేక్షాభావాన్ని కలుగజేయడంలో యిది ద్యోతకమయింది.

అయితే రివిజనిజంయొక్క చిహ్నాలు ప్రారంభంనుండీ వాటి తీవ్ర రూపాలలో వుండివున్నాయని అనుకోరాదు. అవి మెల్లమెల్లగా అవకాశ వాదం అనే సూత్రాలద్వారా నిముషనిముషం లోపలికి ప్రవేశించాయి. అందువలన వాటితో పోరాడటం కష్టమైంది. అందులో చాల వాటిని గత సంవత్సరంలో జరిగిన పార్టీ ద్వితీయకాంగ్రెసులో మితవాద పెడదారి (డేవి యేమన్)పై యిచ్చిన రిపోర్టులో తీవ్రంగా ఖండించడం జరిగింది. ఇంకా కొన్ని బహుశా సవరించబడలేదు. అయితే యిక్కడ మనం చర్చించేది రివిజనిస్టు తప్పులను గురించిగాని మొత్తం పార్టీ కార్యకలాపాలను గురించి మాత్రం కాదు. అందువలన వివిధ ప్రజాపోరాటాలలో పార్టీ నాయకత్వం ద్వారా జరిగిన కృషియొక్క మంచి చెడ్డలను సమీక్ష చేయుడానికి పూను కోవడంలేదు. అయితే మనపార్టీ ఘోరమైన రివిజనిస్టు పెడదారులను తొక్కిన మాట, వాటిపై జరిగిన పోరాటాన్ని కొందరు వ్యక్తులు ప్రతిఘటించిన సంగతీ అవి దాదాపు ఇతరచోట్ల వచ్చిన పెడదారుల స్వభావాన్నే కలిగి వుండిన విషయమూ — అంతా యధార్థమే. అంటే యీ రివిజనిజం పార్టీని బూర్జువా జాతీయతవైపుకు మొగ్గేటట్లు చేసింది. కార్మికవర్గ పోరాటాలను భారత బూర్జువావర్గ అవసరాల కనుగుణ్యంగా నడిపించేటట్లు చేసింది.

ఇక్కడ ఒక యధార్థాన్ని గుర్తించవలసి ఉంది. కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ ఏడవ కాంగ్రెసు యిచ్చిన మహత్తర ఎత్తుగడ విధానంలో కార్మికవర్గంయొక్క పోరాటాలనుమాత్రం కొంచెపరచరాదని హెచ్చరిం చింది. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 18వ కాంగ్రెసు రోజు రోజుకు వృద్ధిచెందుతున్నా అవకాశవాద ప్రమాదాన్నిగురించి హెచ్చరిక చేసింది. ఇదంతా జరిగిన తరువాతకూడా యీ రివిజనిస్టు ధోరణులు తలెత్తాయనికూడా గుర్తించాలి. సోవియట్ యూనియన్ 18వ కాంగ్రె సులో తానిచ్చిన రిపోర్టులో — కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ కార్యవర్గానికి సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధివర్గం యిచ్చిన రిపోర్టులో — కామ్రేడ్ మాన్యుల్‌స్కీ యిలా చెప్పాడు :

"కొన్ని కమ్యూనిస్టుపార్టీలలో సంయుక్త కార్మికవర్గ సంఘటన ఎత్తుగడలనూ, ఫాసిస్టు ప్రతికూల ప్రజాసంఘటన ఎత్తుగడలనూ అన్వయించే సందర్భాలలో మితవాద అవకాశ స్వభావము ద్యోతక మయ్యే కొన్ని ధోరణులు బయటపడ్డాయి. ఉదాహరణ: రాజీవాదులకు వ్యతిరేకంగా జరుగవలసిన పోరాటంయొక్క ప్రాముఖ్యతను కొంచెపరచే ధోరణి; ప్రజాతంత్ర రాజ్యాలని చెప్పబడే వాటి పాత్రను గురించి గొప్పగా చెప్పుతూ, వాటియొక్క సామ్రాజ్యవాద నైఖరిని మరుగుపరచడం. ఇలాంటి ధోరణులు తలెత్తడం — అవి యింకా అతి బాల్యదశలో వున్నప్పటికీ — అవకాశవాదానికి వ్యతిరేకంగా పోరాటాన్ని తీవ్రతరం చేయవలసిన అవసరాన్నిగురించి అవి హెచ్చరిక చేస్తున్నాయి".

అంతేకాదు. అంతర్జాతీయ శ్రామికవర్గానికి ఒకనూతన ఆయుధాన్నీ, ఒక నూతన మార్క్సిస్టు ప్రమాణ గ్రంథాన్నీ — సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ చరిత్రను కామ్రేడ్ స్టాలిన్ సమర్పించిన తరువాత సహితము యీతప్పులను చేయడం సంభవించింది.

ఈ రివిజనిస్టు పొరపాట్లు తిరిగి ఎలా వచ్చారో అర్థం చేసుకొనేందుకు రివిజినిజముయొక్క పంథానే మనము అర్థము చేసుకోవలసిఉంది.

రివిజినిజమురొయొక్క పంథానుగురించి లెనిన్ యీక్రింది విధంగా వ్రాశాడు:

"రివిజినిజము రొయొక్క పాలసీ సందర్భానికి సందర్భాన్ని బట్టి తనప్రవర్తనను నిర్ణయించు కోవడములోనూ, రోజువారీ ఘటనల ననుసరించీ అల్పరాజకీయాలలో వచ్చేమార్పులనూ ఒడుదుడుకులను అనుసరించి తన వైఖరిని సరిపెట్టుకోవడములోనూ యిమిడివుంది. శ్రామికవర్గము రొయొక్క ప్రధాన ప్రయోజనాలనూ, మొత్తము మీద పెట్టుబడిదారీ విధానంయొక్క ప్రధాన లక్షణాలనూ, మొత్తం మీద పెట్టుబడిదారీ పరిణామ స్వభావాన్నీ మరచి పోవడములనే రివిజినిజమురొయొక్క ఉనికి యిమిడి ఉంది. అది తాత్కాలిక ప్రయోజనము కోసము ప్రధాన సిద్ధాంతాలను త్యాగముచేస్తుంది. తా ననుసరంచే పాలసీ స్వభావాన్నిబట్టే అది అనేక స్వరూపాలను

దాల్చుతుంది. దాదాపు ప్రతి "నూతన" సమస్యనూ, దాదాపు అనుకోని, వూహించని సంఘటన లన్నింటికీ – అభివృద్ధి విధానములో ఏమాత్రము కొద్ది కాలానికైనా ఏమాత్రము అల్పమార్పును అది కొని తెచ్చినప్పటికీ అది తప్పని సరిగా ఎల్లప్పుడూ ఏదో ఒకరకమైన రివిజనిజము తలెత్తడానికి దారితీస్తుంది."

— "మార్క్సు - ఎంగిల్సు మార్క్సిజం" మాస్కో ప్రతి పేజి 226

అయితే ఇక రివిజనిజం ఏవిధంగా తలెత్తుతుంది? దీనిని గురించి లెనిన్ యీవిధంగా వ్రాస్తాడు:

"ఆధునిక సమాజంలోని దానివర్గ పునాదులనుబట్టి రివిజనిజంయొక్క అవసరం నిర్ణయింపబడుతుంది............ పెట్టుబడిదారీ సమాజంలో తప్పనిసరి ఎందు కవుతుంది? వివిధజాతీయ ప్రత్యేకరూపాల మధ్యనున్న విభేదాలకంటేనూ, పెట్టుబడిదారీ అభివృద్ధిలోని వివిధదశల తారతమ్యంకంటే ఇది ఎందుకు యింకా ఎక్కువగా గర్భితమైవుంది? ఎందు వల్లననగా ప్రతి పెట్టుబడిదారీ దేశంలోనూ శ్రామికవర్గంతో బాటు ఎల్లప్పుడూ బూర్జువావర్గం, చిన్న చిన్న యజమానులూ ఉంటారు. కొద్దిపాటి ఉత్పత్తి విధానంనుండే పెట్టుబడిదారీవిధానం ఉత్పన్నమైంది. ఎడతెగకుండా ఉత్పన్నమవుతూనే ఉంటుంది. "మధ్యతరగతికి" చెందిన వర్గాలనేకం పెట్టుబడిదారీ విధానంమూలంగా తప్పనిసరిగా నూతనంగా సృష్టింపబడతాయి.

(ఫ్యాక్టరీలకు ఉపాంగములు, గృహవృత్తిపని, దేశమంతటా అక్కడక్కడవున్న చిన్నచిన్న వర్కుషాపులూ, పెద్దపరిశ్రమల అవసరాలనిమిత్తం (సైకిలు ఆటోమొబైల్ పరిశ్రమలూవగైరా) ఈ నూతన చిన్నఉత్పత్తిదారులు తప్పనిసరిగా శ్రామికవర్గ అనుయాయులలోనే తోయబడతారు. అందువల్ల విశాలవంతమైన కార్మిక పార్టీల వర్గాలలో చోటాబూర్జువా ప్రపంచదృక్పథం తిరిగితిరిగి తలెత్తడం సహజంగా తప్పనిసరి అవుతుంది. ఈవిధంగా జరగడం పూర్తిగాసహజమైన విషయమే. శ్రామికవర్గవిప్లవం వచ్చేవరకూ అది జరగడం ఎల్లప్పుడూ సహజమే. అలాంటి విప్లవాన్ని సాధించేలోపల ప్రజానీకంలో మెజారిటీ "సంపూర్తిగా" శ్రామికవర్గ రాజకీయాలను

తప్పనిసరిగా అవలంబించాలని భావించడం పెద్ద పొరపాటు అవుతుంది. సిద్ధాంతపరిధిలో - మార్క్సుకు సిద్ధాంతిసవరణలను ప్రతిపాదించడంలో వచ్చే వివాదములలోనూ కార్మికోద్యమంలో ప్రత్యేక పాక్షిక సమస్యలపై ఆచరణలో రివిజనిస్టులతో వచ్చే ఎత్తుగడలలో భేధాభిప్రాయాలనూ మనం తరచు ఎదుర్కొన వలసివస్తుంది. ఈ సంధర్భాలలోనే కార్మికోద్యమంలో చీలికలు రావడంకద్దు. శ్రామిక వర్గవిప్లవం అన్నిసమస్యలపై ఒత్తిడి తెచ్చిపెట్టినప్పుడు ప్రజలనడకను నిర్ణయించే సందర్భంలో వెనువెంటనే బయల్వెడలు సమస్యలపై భేదాభిప్రాయాల విషయమై కేంద్రీకరించవలసివచ్చినపుడు కార్మిక వర్గం ఎప్పుడులేనంత పెద్దఎత్తున యీ సమస్యను ఎదుర్కోవలసి వచ్చేమాట వాస్తవమే. ఆ పోరాటవేదిలో మిత్రులనుండి శత్రువులను వేరుపరచడం, చెడ్డమిత్రులను బయటకు నెట్టడం తప్పనిసరిగా అవసరమవుతుంది. అప్పుడే శత్రువుపైన బలమైనదెబ్బలు కొట్టేందుకు వీలవుతుంది.

— అదే గ్రంధములో :

ఇంకా :

"కార్మికవర్గ ఉద్యమంలో విప్లవకరమైన సోషల్ డెమోక్రట్లకు (కమ్యూనిస్టులు - అనువాదకుడు) వ్యతిరేకంగా సంస్కరణ వాదులు జరిపే తీవ్రతరమైన పోరాటము ప్రపంచములో నాగరికత ను అందుకొన్న అన్నిదేశాలలోని యావత్తు ఆర్ధిక రాజకీయ పరిస్థితులలో పైన ఉదహరించిన మార్పులయొక్క ఫలితమే. కార్మికవర్గ ఉద్యమము అభివృద్ధి చెందినకొద్దీ ఆ ఉద్యమములోకి వివిధరకాలకు చెందిన ఛోటా బూర్జువాశక్తులు తప్పనిసరిగా ఆకర్షించబడతాయి. ఈ శక్తులు బూర్జువావర్గ సిద్ధాంత ప్రభావముక్రింద ఉంటాయి. ఈ శక్తులు ఆ సిద్ధాంత ప్రభావమునుండి బయటపడటం చాలకష్టం. అందువలన అవి తిరిగితిరిగి బూర్జువా సిద్ధాంతాన్ని స్వీకరించడము జరుగుతూ ఉంటుంది. కాబట్టి యిలాంటి పోరాటం లేకుండా - విప్లవానికి ముందు సిద్ధాంత సమస్యలలో అతివాద సోషలిస్టుకు - మితవాద సోషలిస్టుకూ మధ్య విభజించే స్పష్టమైన రేఖ లేకుండా - యీ

విప్లవ కాలంలో నూతన చారిత్రకశక్తికి చెందిన శ్రామికవర్గానికీ, యితర విప్లవశక్తులకూ, అవకాశవాదులకు, చోటా బూర్జువాకూ మధ్య పూర్తిగా తెగతెంపులు జరగకుండా—శ్రామికవర్గం సాంఘిక విప్లవాన్ని సాధించడం మనం ఊహించలేము''.

— అదే గ్రంధం పేజి 265

"అంతేకాదు. వివిధ దేశాలలో, వివిధజాతీయ ఆర్థిక రంగాలలో పెట్టుబడిదారీ విధానముయొక్క అభివృద్ధి వేగము వివిధ రకాలుగా ఉంటుంది. భారీ పరిశ్రమలు బాగా అభివృద్ధి చెందిన ప్రదేశాలలో మార్క్సిజాన్ని కార్మిక వర్గమూ, దాని సిద్ధాంత కర్తలూ చాల తేలికగా, వేగముగా, పరిపూర్ణముగా, శక్తివంతముగా జీర్ణము చేసుకోగలరు. ఆర్థిక సంబంధాలు బాగా వెనుకబడి ఉన్నప్పుడు, లేక వాటి అభివృద్ధిలో మందగొడితనము వున్నప్పుడు మార్క్సిజములోని కొన్నిభాగాలలోనే పరిపూర్ణత్వము సంపాదించగలిగినవారు, నూతన ప్రపంచ దృక్పథములో కొన్ని భాగాలను మాత్రమే తెలుసుకోగలిగినవారు, బూర్జువా ప్రపంచ దృక్పథము యొక్క సాంప్రదాయాలనుండి, సామాన్యముగానూ, బూర్జువా ప్రజాతంత్ర ప్రపంచ దృక్పథముయొక్క సాంప్రదాయం నుండి ముఖ్యముగానూ ఖచ్చితముగా తెగతెంపులు చేసుకోలేక వ్యక్తిగత వినాదాలతోనూ, డిమాండ్లతోనూ ముందుకొచ్చేవారు కార్మికోద్యమంలో వరుసగా తలెత్తడము సంభవిస్తుంది."

— అదేగ్రంధంలో 253 పేజీ

లెనిన్‌యొక్క ఈ మహత్తర మాటలు రివిజనిజంయొక్క ప్రమాదం ఎల్లప్పుడూ ఏవిధముగా వుండేదీ, దానిని ఏవిధముగా జయించవలసిందీ, నేటికాలపు రివిజనిజంయొక్క పునాదులను అవి ఎంతచక్కగా వివరించేది అర్థంచేసుకొనేందుకు మనకు ఉపయోగ పడతాయి.

సరిగ్గా యిటీవలకాలంలోనే అనేక కమ్యూనిస్టు పార్టీలు చిన్నచిన్న ప్రచారక గ్రూపుల దశనుండి పెద్ద పార్టీలుగా అభివృద్ధి చెందాయి. అందువల్ల యీ పార్టీలలోకి చైతన్యంపొందిన కార్మికులతో బాటు ఎంతోకాలము నుండి సోషల్ డెమాక్రట్ల భ్రమలతోనూ, ఛోటా బూర్జువాజీ బూర్జువా

మేధావుల ఆధిపత్యంలోనూ వున్న వెనుకబడిన కార్మికులు సహితం తప్పని సరిగా ఆకర్షించబడ్డారు. దీనికితోడు యిటీవల కొద్ది సంవత్సరాలలో విపరీతంగా వెనుకబడిన వర్గాలకు చెంది, నిలకడలేని భావాలతోనూ, భ్రమలతోనూ నిండివున్న ప్రజానీకం కార్యాచరణలోకి దిగడం సంభవించింది. వీటన్నిటిని అతిక్రమించి వుండి వున్నట్లయితే - పార్టీ అనుయాయులు తమ యొక్క ఛోటా బూర్జువా దృక్పథాలు విడనాడేందుకు వారికి మార్క్సిజం, లెనినిజంలో శిక్షణ యిచ్చి వుండినట్లయితే, ఆ విధంగా వారు వెనుకబడిన వర్గాల భావాలకు లొంగిపోకుండా మనం కాపాడ గలిగి వుండినట్లయితే - యీ రివిజనిస్టు పొరపాట్లను మొగ్గలోనే త్రుంచి వేయగలిగి ఉండెడివారం.

లెనిన్ చెప్పినమాటలు భారతీయ ఉద్యమానికి, భారతదేశంలోని పార్టీకి యింకా బాగా అన్వయిస్తాయి. చిన్న చిన్న స్థానిక కార్మిక వర్గ గ్రూపుల దశనుండి జాతీయ రాజకీయ రంగంలో ప్రవేశించి, అఖిల భారత సంస్థగా పార్టీ అభివృద్ధి చెందిన దశలో ఛోటా బూర్జువా శక్తులు అనేకం పార్టీలో ప్రవేశించిన ఫలితమే యిటీవల సంవత్సరాలలోని రివిజనిజానికి కారణభూతం. పార్టీ ఏ విధంగా ఛోటా బూర్జువా శక్తులతో నిండివుందో, పార్టీ ద్వితీయ కాంగ్రెసు తేట తెల్లం చేయడంతో పార్టీ యొక్క దృక్పథంలోకి, కార్యాచరణలోకి రివిజనిజం ఏ విధంగా క్రమేణా ప్రవేశించిందో అర్థం చేసుకోవడం తేలికయింది.

ఇంక యిక్కడ వివరాలలోకి వెళ్లడం అనవసరం. కాని రివిజనిజం మనపార్టీలో ఎంతటి అసహ్య పరిస్థితికి దిగజారిందో తెలుసుకొనేందుకు కొన్ని ఉదాహరణలను తీసుకొందాం.

1. 1948 లో జరిగిన పార్టీకాంగ్రెసులో ఎన్నుకోబడిన పాత కేంద్ర కమిటీచే నియమింపబడిన ఉపసంఘం పార్టీకి నూతన నిబంధనావళిని తయారు చేసింది. కేంద్ర కమిటీ దానిని ఆమోదించలేదు. అన్ని రాష్ట్ర కమిటీలకు అది పంపబడింది. కొన్ని రాష్ట్రాలు ఆ నిబంధనావళిని అంగీకరించి ఆమోదించాయి. ఆ నిబంధనావళిలో ఫ్రాక్షన్సును రద్దుచేయమనిఉంది. ఇందులో లిక్విడేషనిస్టు (పార్టీని రద్దు చేసుకొనే తత్వం) ధోరణులు మూర్తీభవించి ఉన్నాయి.

2 పాత కేంద్రకమిటీ సమావేశంలో పార్టీయొక్క నిబంధనావళి చర్చ కొచ్చినప్పుడు నిబంధనావళియొక్క ఉపోద్ఘాతంలో "శ్రామికవర్గ నియంతృత్వం" అన్నపదాన్ని ఉదహరించాలన్న ప్రతిపాదనకు కమిటీలోని మెజారిటీ సభ్యులు వ్యతిరేకంగా ఓటుచేశారు. పార్టి కాంగ్రెసు ప్రతి నిధులు జోక్యం కలిగించుకొని ఆ పదంవుండితీరాలని పట్టుబట్టడం మూలం గానే కమిటీలోని మైనారిటీ సభ్యులు దానిని నిబంధనావళిలో జేర్చడానికి వీలు కలిగింది. "శ్రామికవర్గ నియంతృత్వం" అన్నపదాన్ని చేర్చరాదని వాదించినప్పుడు అవి పాతకాలపునాటి దృక్పథం అనే పేరుతో చేయలేదు. కాని ఆ వ్యతిరేకతకు నిజమైన ఆధారం మాత్రం అదేనని చెప్పకతప్పదు.

3. పార్టీ ద్వితీయకాంగ్రెసు సమావేశమవుతున్న సమయంలో జరిగిన ఒక కేంద్రకమిటీ సమావేశంలో ప్రజాతంత్ర సంఘటనకూడా ఏకీకృతమైన సంస్థ స్వభావాన్ని కలిగి వుండాలనే టిటోవాదనను మనంకూడా అంగీక రించాలని మైనారిటీ సభ్యులు ప్రతిపాదించారు. కాని మెజారిటీ సభ్యులు ఆ ప్రతిపాదనను త్రోసివేశారు. అయితే దీనిని పార్టీ రాజకీయ థీసిస్‌లో అంగీకరించక పోయినా, ఓడిపోయిన ఆ ప్రతిపాదన భావం "పార్టీకాంగ్రెసు సమీక్ష" అన్న వ్యాసంలో ప్రతిధ్వనించింది.

4. దాదాపు 11 సంవత్సరాల క్రిందటనే శ్రామికవర్గ అంతర్జాతీయ తత్వానికి ప్రతికూలంగా యుద్ధం ప్రారంభమైంది. కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్ యొక్క ఆరో కాంగ్రెసూ, ఏడో కాంగ్రెసుకూడా సోవియట్ యూనియన్ రక్షణ అంతర్జాతీయ తత్వానికి గీటురాయి అని సరిగా స్పష్టం చేసింది. దానిని ఆధారం చేసుకొని పార్టీనాయకులలో ఒకాయన 1936లో ఒక వ్యాసాన్ని వ్రాస్తూ, హిట్లర్ దురాక్రమణకు వ్యతిరేకంగా జరిపే పోరాటంలో సోవియట్ యూనియన్‌ను కమ్యూనిస్టులు బలపరుస్తారని స్పష్టంగా ఉదహరించాడు. సోవియట్ యూనియన్ వున్న పక్షంలోనే బ్రిటన్‌కూడా వుండినా అందుమూలంగా యుద్ధంయెడల కమ్యూనిస్టులవైఖరి మారబోదని కూడా తెలిపాడు. ఈ వైఖరిని అప్పుడున్న పోలిట్‌బ్యూరో కాదని నిరాకరించింది. అటువంటి పరిస్థితులు సంభవించినప్పుడు కమ్యూ నిస్టులు జాయింటు యుద్ధానికి సాయపడరనీ, బ్రిటన్‌తో పోరాడుతారని పొలిట్ బ్యూరో చెప్పింది.

అందుకే హిట్లర్ దురాక్రమణ జరిగిన తరువాత ఆరుమాసాల వరకూ యుద్ధస్వభావాన్ని గురించి పార్టీ తన వైఖరిని మార్చుకోలేదంటే అది ఏదో యాదృచ్ఛికంగా జరిగిన సంఘటన అని అనుకోరాదు. ఇది శ్రామికవర్గ అంతర్జాతీయతను వ్యతిరేకించడం తప్ప మరొకటి ఎంత మాత్రమూ కాదు.

పార్టీపంథా ఆ తరువాత మారినప్పటికీ, వెంటనే అది ఆనాడున్న బూర్జువా జాతీయ స్వభావానికి అనుగుణ్యంగా సరిచేయబడింది. యుద్ధ స్వభావంలో వచ్చిన మార్పును గురించి వివరించే సందర్భంలో సోవియట్ యూనియన్ విషయమూ, దానిపై జరిగిన దాడి సంగతిని గురించీ ప్రస్తావన చేయడం క్రమక్రమేణా మానివేయడం జరిగింది. పార్టీపంథాలో వచ్చిన ఈమార్పును జపాను దురాక్రమణ పేరిట దేశరక్షణపేరిట – అంటే బూర్జువా జాతీయతతో – సమర్థించి చెప్పడం జరిగింది. ఈ విముక్తియుద్ధానికి గల అంతర్జాతీయ స్వభావం దానికి గల వర్గస్వభావమూ, అందులో సోవియట్ యూనియన్‌యొక్క పాత్ర – వీటన్నింటిని గురించి విస్తావించడం మానివేశారు.

ఒకవైపున ప్రపంచ విముక్తి పోరాటంలో సోవియట్ యూనియన్ పాత్రయొక్క ప్రాముఖ్యతను గురించి చెప్పడం క్రమ క్రమేణా మానివేసి మరొక వైపున దేశంలో వర్గపోరాట సమస్యను అచ్చగా బ్రౌడర్ పద్ధతితో వెనక్కునెట్టివేయడం జరిగింది.

5. "సెక్టేరియనిజాన్ని" ఎదుర్కొంటున్నామనే పేరుతో శ్రామిక వర్గం యొక్క స్వతంత్ర కార్యకలాపాలనూ, శ్రామికవర్గ నాయకత్వ పాత్రనూ గుర్తింప జేసేందుకు జరిగే పోరాటాన్ని వెనక్కునెట్టడం సంభవించింది. సంయుక్త జాతీయ సంఘటన అనేపేరుమీద సిద్ధాంతరీత్యా, రాజకీయంగానూ పెట్టుబడిదారీ తత్వానికి లొంగిపోవడం క్రమేణా ప్రారంభమైంది. "నేషనల్ ఫ్రంటు" (యుద్ధానికి పూర్వం భారతకమ్యూనిస్టుపార్టీ వార పత్రిక – అనువాదకుడు) పత్రికలో ప్రచురించబడిన ఒకవ్యాసంలో "గాంధీజానికి తిరిగి మెరుగు పెట్టాలి" అనే విధంగా వ్రాయబడింది. అయితే అది అప్పుడు విమర్శనకు గురైంది. కాని యిటీవల కాలంలో గాంధీ నెహ్రూలముందు దాసోహమనడం మామూలైపోయిన లొంగుబాటు తత్వా

నికి అది నాంది అని చెప్పవచ్చు. మార్క్సిజమే ఉత్తమ దేశభక్తి అన్న సూత్రాన్ని, బూర్జువా దేశభక్తే ఉత్తమమార్క్సిజం అన్న అర్థానికి దారి తీసేటట్లు చేయడమైనది.

అయితే సంయుక్త సంఘటన ఎత్తుగడలను అన్వయింపజేయడం పొరపాటని ఎవరూ సూచించబోవడంలేదు. మెజారిటీ ప్రజలను మన వైపుకు త్రిప్పుకోవడానికీ, శ్రామికవర్గ నాయకత్వాన్ని పెంపొందింపజేయ డానికి ఎత్తుగడలు అవసరమే అయితే, రివిజనిస్టు దృష్టితో సంయుక్త సంఘట నను అర్థం చేసుకోవడం అవకాశవాదం అవుతుంది. చేసిన తప్పులన్నింటికీ ఆధారం అదే

రైతురంగంలో ఇది ధనికరైతునూ, మధ్యతరగతి రైతునూ, బీద రైతునూ, వ్యవసాయకార్మికుని ఒకే ముద్దగా ఏకంచేసి – ఇదే రైతు ఐక్యత అని చెప్పే వర్గేతరదృక్పథానికి దారితీసింది. ఇది ఆచరణలో రైతు ఉద్యమం మధ్యతరగతి రైతుల స్వాధీనంలో వుండేటట్లు చేసి, ఆ వర్గం యొక్క వూగిసలాటతో ఉద్యమ స్వభావం నిర్ణయించబడుతూ వచ్చింది. దీని ఫలితంగా ధనికరైతులతో అనేకసార్లు రైతుఉద్యమం రాజీపడటం సంభవించింది. భూస్వామిక విధాన సమస్యపై మధ్యతరగతి రైతులు యింకా తమ వూగిసలాటను ప్రకటించకముందే పార్టీనాయకులలో కొంత మంది వూగిసలాటను ప్రారంభించారు. 1938కే జమీందార్లకు పరిహారం చెల్లించాలనే నినాదం కొంతమంది నాయకుల యిష్టాగోష్టిలో పొక్కింది. పట్టణ కార్మిక వర్గానికి, బీద రైతాంగానికి దృఢతరమైన మిత్రుడుగావుండే గ్రామీణ శ్రామికవర్గంపై ఆధారపడేందుకు బదులు, రివిజనిస్టులు ప్రధా నంగా మధ్యతరగతి రైతులపై ఆధారపడి (అదికూడ చాలచోట్ల నాయ కత్వం ధనికరైతుల చేతులలో ఉంది) వ్యవసాయక విప్లవాన్ని సాధించ డానికి ప్రయత్నించారు. ఈవిధంగా మనం మరొకసారి రైతు ఐక్యతను బూర్జువావర్గ దృక్పథంతో చూశాము. మన ఉద్యమాన్ని అర్థశ్రామికు లపై ఆధారం చేసుకొని స్వతంత్రంగా ప్రజాపోరాటాలను సాగించలేక పోయాం.

అయినప్పటికీ ప్రథమదశలో తన స్వతంత్ర నాయకత్వంక్రింద దైనం దిన పోరాటాలను కార్మిక కర్షకులఆర్థికపోరాటాలను నడపడం మూలంగా

పార్టీ అభివృద్ధి చెందింది. చివరకు యీమాత్రం దానిని సహితం విధ్వంసం చేయడానికి ప్రయత్నాలు జరిగాయి.

కార్మికుల పరిస్థితులు భరింపశక్యంగాని స్థితిలోవున్న సమయంలోనే పెట్టుబడిదారీ ఉత్పత్తి అధికంచేయాలన్న పేరుతో వర్గకలయికనూ, వర్గ శాంతిని బాహాటంగా ప్రతిపాదించడం జరిగింది. ఈ విధమైన పాలసీని చేపట్టడమంటే సమ్మెల నన్నింటినీ నాశనంచేయడానికి బాహాటంగా ప్రయత్నించడం, పెట్టుబడిదారులకు సంపూర్తిగా దాసోహమనడం తప్పమరొకటి కాదు.

అయితే యివన్నీ ఎలా జరిగాయి? ఏ ముసుగుక్రింద మరుగు పరచబడ్డాయి? లెనిన్ మాటలను దుర్వినియోగం చేయడం మూలంగానూ, లెనిన్ మాటలకు వక్రభాష్యం చెప్పడంద్వారానూ యిదంతా జరిగింది. ఉదాహరణకు అర్థిక వాదానికి (ఎకనమిజం) వ్యతిరేకంగా పోరాడమని లెనిన్ యిచ్చిన పిలుపును తమయొక్క ఆర్థికకోర్కెలకొరకు జనసామాన్యం చేసే పోరాటాలకు అడ్డుతగిలి నాశనం చేయడమని వక్రభాష్యం చేశారు. ఎప్పుడైనా అలాంటి పోరాటాలను తీసుకొని వచ్చినప్పుడు - నిర్బంధ విధానం ప్రవేశపెట్టబడింది గాబట్టి - బూర్జువా ప్రచార ఫలితంగా ప్రజలలో తాత్కాలికంగా యీ పోరాటానికి వ్యతిరేక అభిప్రాయాలు కలిగాయి గాబట్టి - ఆ పోరాటాలు పార్టీని రాజకీయంగా వేరుపరుస్తున్నాయనే నెపంతో, అదంతశుద్ధ "ఆర్థికవాదమంటూ" ఖండించేవారు. లెనిన్ మాటలకు ఎన్నడూ యింత విపరీతంగా వక్రభాష్యం చెప్పివుండలేదు. సంస్కరణ వాద ప్రచారంకోసం యితర తప్పుడుప్రచారంకోసం ఉదాహరణకు ఉత్పత్తి అధికంచేయాలనే నినాదంకొరకు పోరాట ప్రజలను ఉత్సాహపరచలేక విఫలులయినప్పుడు "ఆర్థికతత్వం" అనే నేరాన్ని తరచుమోపడం జరిగేది.

"ప్రాప్తకాలజ్ఞత"కు వ్యతిరేకంగా పోరాడుతున్నామనే పేరుతో ప్రజలు తమంత తాము తీసుకొచ్చే పోరాటా లన్నింటిని ఖండించడం జరిగేది. బూర్జువా వర్గానికి, దాని అనుయాయులకు ప్రతికూలంగా జరిగే వాటి నన్నింటినీ "ఆర్థికవాదం", "ప్రాప్తకాలజ్ఞత" అనే పేర్లుపెట్టి ఖండించడం జరిగేది. ఇక కార్మికవర్గం స్వతంత్రంగా రాజకీయ కార్యాచరణకు గడంగినప్పుడల్లా "వాన్‌గార్డిజం"(తొందర పడిందని)అనేపేరుతో ఖండించం జరిగేది.

ఆఖరకు పోలీసుకు వ్యతిరేకంగా పోరాడినా మీరే రెచ్చగొట్టుతున్నారనే పేరుతో ఖండించబడేది. ఈ విధంగా అనేకం జరిగాయి ఒక్క మాటలో చెప్పాలంటే ఆర్థికంగాగాని, రాజకీయంగాగాని కార్మికవర్గమూ, కష్టజీవులూ స్వతంత్రంగా కార్యాచరణకు దిగడాన్ని పూర్తిగా నిషేధించే ప్రయత్నమిది.

ఇది పార్టీయొక్క అగ్రగామిపాత్రను బాహాటంగా కాదని నిరాకరించడం, ప్రజానీకం నుండి నేర్చుకొనేందుకు నిరాకరించడంతప్ప మరొకటి కాదు.

ఈ విధంగా రివిజనిజం – శ్రామికవర్గ పోరాటాన్ని బూర్జువావర్గ అవసరాలకు బలిపెట్టి తన పని ఎక్కడ ముగించాలో అక్కడ ముగించుతోంది.

అయితే ఒక్క విషయాన్ని మాత్రం అర్థంచేసుకోవాలి సుమా! ఇదంతా "సెక్టేరియనిజాన్ని" "ఆర్థికవాదాన్ని" "పురోగామివాదాన్ని" (వాన్‌గార్డిజం), ఎదుర్కొంటున్నామనే పేరుమీద జరుగుతోంది!! ఇవన్నీ మార్క్సిజాన్ని ప్రత్యేక పరిస్థితులకు సక్రమంగా అన్వయింపజేస్తున్నామనే పేరుతో అస్పష్టమార్క్సిజాన్ని నిరాకరించుతున్నామనేపేరుతో–మార్క్సిజాన్ని అన్వయింపజేయడానికి జాతీయరూపాలను అన్వేషిస్తున్నామనేపేరుతో జరిగాయి !!! అదే జబ్బు, అదే చిహ్నలూ, అదేవిధమైన చిత్తభ్రమతో వెర్రికేకలు,

ఇక ఆత్మవిమర్శన విషయంలో – అదేవాదనతో – పార్టి సామాన్య సభ్యుల చైతన్యం తగినంత పరిపక్వదశకు రాలేదనే సాకుతో ఉన్న భేదాభిప్రాయా లన్నింటినీ "హుషప్" చేసేవారు. పార్టివిధానంలో వచ్చిన ప్రతి మార్పూ వెనకటి విధానంయొక్క సహజపరిణామం ఫలితమే నని చెప్పడానికి ప్రయత్నించేవారు.

పార్టి ద్వితీయకాంగ్రెసు జరిగిన తదనంతరం మితవాద సంస్కరణ రివిజనిజం అనే జబ్బుతోపాటు "అతివాద రివిజనిజం" (అల్ట్రా లెఫ్ట్ లివిజనిజం) అనే జబ్బుకూడా కొంతవరకు తలెత్తింది. ఈ రకమైన రివిజనిజానికి లోనైనవారు వర్గసంబంధాలను దృష్టిలో పెట్టుకోకుండా పెద్దపెద్ద కబుర్లు మాట్లాడుతారు. ఇక వాస్తవిక పరిస్థితులకు తాము చెప్పేదంతా ఎదురైనదని తెలుసుకొన్న వెనువెంటనే మితవాద సంస్కరణవాదంలోకి సరాసరి పడిపోతారు. మరొకరకంవారుకూడా ఉన్నారు. ప్రతివారినీ విమర్శించ

డానికి తమకు హక్కున్నదని భావిస్తారు. కాని తమను యితరులు విమ ర్శించడాన్ని సహించరు.

గతసంవత్సరం భారతకమ్యూనిస్టుపార్టీ ద్వితీయ కాంగ్రెసు రివిజ నిజానికి వ్యతిరేకంగా పోరాటాన్ని ప్రారంభించింది. కాని అప్పటినుండి పార్టీలో రివిజనిస్టు తప్పులూ, ధోరణులూ మటుమాయమయినా యని ఊహించడం పొరపాటు.

పార్టీ ద్వితీయ కాంగ్రెసు జరిగినప్పటినుండి సంస్కరణవాదాన్ని ఎదుర్కొంటున్నామనే ముసుగుక్రింద రివిజనిజం తలదాచుకొన్నది. కాని సంస్కరణవాదానికి వ్యతిరేకంగా జరిగే పోరాటమంతా మాటలలో మాత్రమే. నిజానికి ఆచరణలో - జనసామాన్యంయొక్క పోరాటాలను పరిత్యజించడం, పెద్దపెద్ద విషయాలనుగురించి కబుర్లాడటం, అంతిమ పోరాటానికి సిద్ధపడుతున్నా మనడం, రోజురోజుకు అభివృద్ధి చెందుతున్న పోరాటాలకు నాయకత్వం వహించి నడిపించడానికి వెనకడుగు వేయుడం - ఇదీ ఆచరణలో జరుగుతున్న విషయం. పోరాటాలకు కనీస సన్నాహాన్ని సహితం చేయకపోవడం, ప్రజల విజయంలోనూ, వారి పోరాటంలోనూ విశ్వాసం లేకపోవడం, వీటికితోడు పెద్దపెద్దకబుర్లు మాట్లాడటం, సంస్క రణవాదానికి ప్రతికూలంగా పైపై పోరాటాన్ని జరపడం - ఇవి నేటి రివిజ నిజంయొక్క లక్షణాలు.

ఇదే సమయంలో నిర్మాణరీత్యా చూస్తే రాజీవాదులముందు లొంగి పోవడమో, లేక వారితో సరిపెట్టుకొనే విధానాన్ని అనుసరించడమోజరుగు తున్నది. అంతే కాదు; నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పోరాడే యోధుని స్వరూపంకూడా తీసుకొంటున్నది. కాని వాస్తవానికి యీ పేరుతో అది బూర్జువా వ్యతిరేకతతో పార్టీలోపల విచ్ఛిన్నకర పాత్రను అవలంబించు తోంది.

ఈ తప్పులకు సంఘంలోనే వేరు లున్నాయి. వీటిని ఊడబెరకనిదే రివిజనిజం అభివృద్ధి అయ్యే ప్రమాదం ఎల్లప్పుడూ ఉండనే వుంటుంది. పార్టీలో దానికి ఎలాంటి తావునూ యివ్వకుండా, ఆధోరణులకు వ్యతిరే కంగా పార్టీలో అంతరంగికంగా తీవ్రమైన పోరాటాన్ని కొనసాగించనిదే చోఖా బూర్జువా దృక్పథంలోనూ, ధోరణులలో ఆశ్రయం గలిగిన రివిజి

నిజాన్ని పూర్తిగా వదిలించుకోవడం కష్టం. అలాంటి ధోరణులకు బాహాటంగా ప్రాతినిధ్యం వహించేవారి యెడల ఎలాంటి రాజీభావాన్ని ప్రదర్శించడానికి నిరాకరించాలి. పార్టీ సభ్యులందరికీ మార్క్సిజం - లెనినిజంలో శిక్షణ యివ్వడానికి అన్ని విధాలా ప్రయత్నించాలి. పార్టీలోనూ, నాయకత్వం వహించే కమిటీలలోనూ అవసరమైన సాంఘిక మార్పులను తేవడానికి (కార్మిక వర్గానికి కార్మికవర్గ తత్వానికి సంబంధించినవారు ఎక్కువగా వుండేటట్లు చేయడం), త్వరగా అవసరమైన చర్యలను తీసుకోవాలి. అప్పుడే రివిజినిజం పూర్తిగా రద్దుకావడానికి వీలవుతుంది.

రివిజనిజంయొక్క సాంఘిక పునాదులను అర్థంచేసుకోవడం, దానికి వ్యతిరేకంగా సాగించే పోరాటాన్ని పార్టీ అభివృద్ధికి జరిగే పోరాట సమస్యలో ఒకభాగంగా పరిగణించడం. ఈ పోరాటాన్ని వ్యక్తులమధ్య పోరాటంగా మారిపోకుండా జాగ్రత్తపడుతూ ఆ విధంగా పార్టీని బోల్షివిక్ తత్వంతో నింపడం - వీటన్నింటినీ పార్టీలోని ప్రతి ఒక్క సభ్యుడు తన యొక్క కనీస కర్తవ్యంగా ఎంచుకోవాలి. పార్టీ సభ్యులంతా మార్క్సిజం-లెనినిజంలో తగినంత పరిజ్ఞానాన్ని సంపాదించగలిగితేనే, స్టాలిన్ రచించిన మహత్తరగ్రంథమైన సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ చరిత్రను క్షుణ్ణంగా అధ్యయనం చేసేందుకు తమ మనస్సుల నన్నింటినీ పూర్తిగా కేంద్రీకరించ గలిగితేనే, లెనిన్‌యొక్క రచనలనూ, రివిజనిజానికి వ్యతిరేకంగా ఆయన సాగించిన పోరాటాన్ని పూర్తిగా అధ్యయనం చేయగలిగితేనే-రివిజనిజాన్ని ఎదుర్కోవడం సాధ్యమవుతుంది. ఆవిధంగా అధ్యయనం చేయగలిగితేనే పార్టీ అంతా సమిష్టి బుద్ధితో శక్తివంతంగా తన కర్తవ్యాలను నిర్వహించుతూ నిజమైన ఆత్మవిమర్శన చేసుకోవడం సాధ్యపడుతుంది. అలాంటి రకమైన అధ్యయనమే వర్గ దృక్పథంతో సంబంధంలేని వ్యక్తిగత అభిప్రాయాలను వెలిబుచ్చడానికి బదులు సాధారణంగా అంగీకరించబడిన సూత్రాలపై ఆధారపడి విషయపరిజ్ఞానం గలిగిన విమర్శన చేసేందుకు పార్టీ సభ్యులకు తగు శిక్షణ నిస్తుంది. ఆరకమైన అధ్యయనమే ప్రతివ్యక్తీ తనకుతాను జాగ్రత్తగా పరిశీలించుకొని, వ్యక్తిగత అహంకారాన్ని, విచ్ఛిన్నకరమైన విమర్శనా స్వభావాన్నీ త్యజించేటట్లు చేస్తుంది. పార్టీలోని నిరంకుశత్వాన్నికూడా అలాంటి అధ్యయనమే నిర్మూలించ

గలుగుతుంది. మార్క్సిజం – లెనినిజాన్ని గట్టిగా అంటిపెట్టుకోవడం మూలంగానే రివిజనిజానికి స్వస్తిచెప్పడానికి వీలవుతూ, మనం నాయకత్వం వహించి నడుపుతున్న ప్రజాపోరాటాల అగ్నిజ్వాలలలోనే – అది మండి మసి అయిపోతుంది.

– సంపాదకవర్గం

"కమ్యూనిస్టు" పత్రిక (ఫిబ్రవరి 1949)

మార్క్సిస్టు – లెనినిస్టు సిద్ధాంతంలో వున్న శక్తి ఏమంటే– అది ఏ పరిస్థితులలోనైనా పార్టీకి సరియైన మార్గాన్ని చూపెడుతుంది. ఆనాటి ఘటనలలోని ఆంతరంగిక సంబంధాన్ని అర్థం చేసుకొనేటట్లు చేస్తుంది. ప్రస్తుతం తాము ఏమార్గాన ఎలా ముందుకు పోతున్నామో అనే దృశ్యాన్నేగాక – భవిష్యత్తులోకూడా తాము ఏమార్గాన ఎలా ముందుకు పోవలసివస్తుందో ఆదృశ్యాన్నికూడా – ముందుగానే గ్రహించి, తమ మార్గాన్ని చూడగలిగేటట్లు చేస్తుంది

మార్క్సిస్టు – లెనినిస్టు సిద్ధాంతాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసిన పార్టీ మాత్రమే, కార్మికవర్గానికి ఆత్మవిశ్వాసంతో నాయకత్వం వహించి, దానిని ముందుకు నడుపగలుగుతుంది.

మార్క్సిస్టు – లెనినిస్టు సిద్ధాంతాన్ని పూర్తిగా అధ్యయనం చేయని పార్టీ తన మార్గంకోసం తపుళ్ళాడుకోవలసివస్తుంది. తన చర్యలలో ఆత్మవిశ్వాసాన్ని పోగొట్టుకొంటుంది. కార్మికవర్గాన్ని ముందుకు నడుపలేకపోతుంది.

— సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చరిత్రనుండి

# కార్మికవర్గపార్టీ :: నిర్మాణం

★ స్టాలిన్

విప్లవదశకుపూర్వం, రెండవ అంతర్జాతీయ సంస్థకు చెందిన పార్టీలు కార్మికోద్యమంలో ఆధిక్యతవహించి యున్నప్పుడు, శాసనసభా పోరాటపద్ధతులే ప్రధాన పోరాటకార్యక్రమంగా ఎంచబడిన కాలంలో పార్టీకి, ఆదశ తరువాత బహిరంగ విప్లవపోరాటాలు జరిగే పరిస్థితులలో స్పష్టంగా ఏర్పడిన ప్రాముఖ్యత లేకపోయింది. రెండవ అంతర్జాతీయ సంస్థమీద చేయబడిన విమర్శనా దాడులకు సమాధానంగా కాట్‌స్కీ, రెండవ అంతర్జాతీయ సంస్థకు చెందిన పార్టీలన్నీ శాంతిని నెలకొల్పుటకు సాధనములే గాని యుద్ధము సాగించే పార్టీలుగావని, అందువల్ల యుద్ధకాలంలోగాని లేక కార్మికవర్గం విప్లవాన్ని సాగించే దశలోగాని తీవ్రకార్యక్రమాన్ని అనుసరించి పనిచేయుటకు ఆ పార్టీలకు బలం లేకపోయిందనీ చెప్తూ రెండవ అంతర్జాతీయ సంస్థను సమర్థించాడు! అది నిజమే. కాని దాని అర్థం ఏమిటి? కార్మికవర్గముయొక్క విప్లవ పోరాటాలకు రెండవ అంతర్జాతీయ సంస్థకు చెందిన పార్టీలు పనికిరావని, కార్మికవర్గాన్ని అధికారస్వీకరణకై ముందుకునడపగల్గిన తీవ్ర కార్మికవర్గ పార్టీలు కావని, కేవలం శాసనసభా ఎన్నికలలో పాల్గొనుటకు, శాసనసభా పోరాటపద్ధతులను అవలంబించుటకు ఏర్పడిన పార్టీలని స్పష్టపడుతుంది. దీనివల్ల మరొక విషయంకూడా బోధపడుతుంది. రెండవ అంతర్జాతీయ సంస్థకు చెందిన ద్రోహులు అత్యున్నతదశలో ఉన్నరోజుల్లో, కార్మికవర్గంయొక్క ప్రధాన రాజకీయ సంస్థ-పార్టీ కాదు. పార్టీకి చెందిన శాసనసభా గ్రూపే వారి రాజకీయ సంస్థగా ఉండేది. నిజంగా ఆ రోజుల్లో పార్టీ ప్రాధాన్యత వహించక, శాసనసభా గ్రూపును అంటిపెట్టుకొని యుండేది. అటువంటి పరిస్థితుల్లో, అటువంటి పార్టీ నాయకత్వంక్రింద కార్మికవర్గాన్ని విప్లవానికి తయారుచేసే సమస్యయే లేకుండా పోయింది.

కాని నూతన దశ ప్రారంభంతో తీవ్రమైన మార్పువచ్చింది. బహిరంగ వర్గపోరాటాలు, కార్మికవర్గము సాగించే విప్లవపోరాటాలు, కార్మిక విప్లవం – వీటిలో సామ్రాజ్యవాదమును కూలద్రోయుటకు విప్లవశక్తులన్నీ ఐక్యమయి, కార్మికవర్గం అధికారంకొరకు సాగించే పోరాటంతో. నూతన విప్లవదశ ప్రారంభమయింది. ఈ దశలో కార్మికవర్గాన్ని ఎదుర్కొన్న నూతన కర్తవ్యాల్లో ప్రధానమైనవి: పార్టీ కార్యకలాపాలన్ని

టనీ విప్లవపంథాలో పునర్నిర్మించుట: అధికార స్వీకరణకొరకు, విప్లవపంథాలో తిరిగి కార్మికుల కందరికి విద్యగరపుట; అండగా నిలిచి సహాయపడే రిజర్వులనన్నింటినీ తయారుచేసి కదల్చుట; ప్రక్క-దేశాలలోని కార్మికవర్గాలతో సన్నిహిత సంబంధాలను ఏర్పరచుకొనుట; వలసదేశాలలోనూ, అస్వతంత్రదేశాలలోనూ రేగుతున్న స్వాతంత్ర్య ఉద్యమాలతో సంబంధాలు కల్పించుకొనుట........మొదలయినవి. ఈ నూతన కర్తవ్యాల నన్నిటినీ ప్రాత సోషల్ డెమాక్రాటిక్‌పార్టీలతో, శాసనసభా కార్యక్రమంలో శాంతియుతంగా పెరిగిన ఆ పార్టీలతో— నెరవేర్చగలమని అనుకొనుట మన గొయ్యిని మనమే త్రవ్వుకొనుట అవుతుంది. ఇటువంటి మహత్తర కర్తవ్యాలను నెరవేర్చవలసిన కార్మికవర్గం ప్రాతపార్టీల నాయకత్వం క్రిందనే ఉన్నయెడల, కార్మికవర్గం నిరాయుధంగా ఉండవలసిందే. అటువంటి పరిస్థితికి కార్మికవర్గం ఎప్పుడూ అంగీకరించదని వేరుగా చెప్పనవసరంలేదు.

అందువల్లనే ఒక నూతన విప్లవ పార్టీ-ధైర్యంగా శ్రామికవర్గాన్ని పోరాటంలో నడుపగల్గినపార్టీ - నూతనవిప్లవ పరిస్థితులలో ఏర్పడే క్లిష్టపరిస్థితుల నన్నింటిని ఎదుర్కొనగల్గి అన్ని అడ్డంకులను త్రోసివేసుకొని ముందుకు నడుప గల్గినపార్టీ - అవసరమైంది.

అటువంటి విప్లవపార్టీ లేకుండా సామ్రాజ్యవాదాన్ని కూలద్రోయాలని, కార్మికవర్గ నియంతృత్వాన్ని స్థాపించాలని అనుకొనుటలో అర్థం లేదు.

ఈ నూతనపార్టీయే లెనినిజమ్ యొక్క పార్టీ.

ఈ పార్టీయొక్క ప్రత్యేకలక్షణాలు ఏమిటి?

## 1 పార్టీ కార్మికవర్గంయొక్క నాయకత్వం

అన్నిటికంటె ముందు, పార్టీ కార్మికవర్గ నాయకుడుగా ఉండాలి. కార్మికవర్గములోని ఉన్నతమైన వారందరితోపాటు, వారి అనుభవాన్ని, విప్లవచైతన్యాన్ని, శ్రామికవర్గ ఆశయంకొరకు వాటికి గల స్వార్థరహితమైన ఆసక్తిని పార్టీలో జీర్ణింపచేసుకోవాలి. కాని కార్మికవర్గ నాయకత్వముగా తయారగుటకు పార్టీకి ఒక విప్లవసిద్ధాంతం, ఉద్యమంయొక్క సూత్రాలు, విప్లవ సూత్రాలతో కూడినజ్ఞానంకూడా అత్యవసరం. ఇవిలేకుండా శ్రామికవర్గ పోరాటాలను, శ్రామికవర్గాన్ని పార్టీ నడుపలేదు. కార్మిక ప్రజాసామాన్యం ఆలోచించే హద్దులలోనే పార్టీకూడా ఉన్నయెడల పార్టీ నిజమైన విప్లవపార్టీ కానేరదు. (ఉద్యమంయొక్క తోకను పట్టుకొని ప్రాప్తకాలజ్ఞుడివలె సాగిపోవుట, అకస్మికంగా బయలుదేరే ఉద్యమంయొక్క జడత్వాన్ని, రాజకీయ విముఖత్వాన్ని నిర్మూలించలేకపోవుట, శ్రామికవర్గముయొక్క తక్షణ లాభాలను మాత్రం పాటించేదృష్టిని చాటలేకపోవుట, కార్మికవర్గ ప్రయోజనములకొరకై ప్రజాసామాన్యమునంతనూ ఉత్తేజపరచలేకపోవుట- ఇవి పార్టీ లక్షణములుకావు). కార్మికవర్గంముందు పార్టీనిలబడాలి: కార్మిక

వర్గాన్ని ముందుకు నడపాలిగాని దానితోకను పట్టుకొని ఆకస్మికోద్యమాన్ని అనుసరించి పోకూడదు. ఖోవోస్టిజమ్‌ను (తోకపట్టుకొని పోయే విధానం) బోధించే రెండవ అంతర్జాతీయ సంస్థకు చెందిన పార్టీలయొక్క పాలసీ బూర్జువావర్గ పాలసీయే. దీని ప్రకారం బూర్జువావర్గానికి పనిముట్టుగా ఉపయోగపడే సాధనంగా శ్రామికవర్గాన్ని ఖండించుట జరుగుతుంది. శ్రామికవర్గానికి ముందుండి నాయకత్వం వహించగల పార్టీయే, శ్రామిక వర్గ ప్రయోజనములను బలపరచుటకై ప్రజా సామాన్యంఅంతనూ ఉత్తేజపరచగలపార్టీయే- ట్రేడ్‌యూనియనిస్టు ఆర్థిక పంథానించి కార్మికవర్గాన్ని మరల్చి స్వతంత్ర రాజకీయ శక్తిగా తయారుచేయ గలుగుతుంది. కార్మిక వర్గంయొక్క రాజకీయ నాయకత్వం-పార్టీ.

కార్మికవర్గ పోరాటంలోని కష్టాలను గురించి, క్లిష్టపరిస్థితులనుగురించి వ్యూహం, ఎత్తుగడలను గురించి, పన్నుగడలను గురించి దాడి, తిరోగమనాలను గురించి చెప్పాను. ఇవన్నీ యుద్ధ పరిస్థితులలోకంటె క్లిష్టమైనవని గ్రహించాలి. ఈ క్లిష్టపరిస్థితులను ఎదుర్కొని, నిలబడి అసంఖ్యాకులైన శ్రామికులకు సరియైనమార్గం ఎవరు చూపగలరు? యుద్ధంచేస్తున్న సైన్యము నుంచి అనుభవం కల్గిన సైన్యాధిపతుల కమిటీని త్రోసివేయుట తప్పనిసరిగా అపజయాన్ని కోరుకొనుటకే. అటువంటి పరిస్థితులలో కార్మికవర్గం నాయకత్వాన్ని కాదనుటవల్ల, దానియొక్క పిశాచ శత్రువులబారికి గురిఅగుటయే జరుగుతుంది. కాని నాయకత్వం ఎక్కడ ఉంది? శ్రామిక వర్గంయొక్క విప్లవపార్టీయే కార్మిక వర్గ నాయకత్వంగా పనిచేయగలదు. విప్లవ పార్టీలేని కార్మికవర్గం, యుద్ధకమిటీ లేని సైన్యముతో సమానం. పార్టీయే కార్మికవర్గంయొక్క యుద్ధకమిటీ.

కాని పార్టీ వేరుగాఉండే నాయకత్వము మాత్రమే కానేరదు. కార్మికవర్గములో ఒక భాగమై, కార్మికవర్గంలో అవినాభావ సంబంధంకల్గి ఉండాలి. వర్గములులేకుండా పోయేటంతవరకూ, పార్టీకి, కార్మిక ప్రజా సామాన్యమునకు, మరియు పార్టీసభ్యులకు పార్టీసభ్యులుకాని ప్రజాసామాన్యమునకు భేదము ఉండక తప్పదు. కార్మికేతర వర్గాల నుంచి కొత్తవారు కార్మికవర్గంలోకివచ్చి చేరుతున్నంతవరకూ, కార్మికవర్గమంతా అభివృద్ధిచెంది నాయకుడుగా తయారు కానంత వరకూ ఈ భేదము లుండక తప్పవు. కాని ఈ భేదం ఎక్కువయి, పార్టీ సభ్యులు కాని ప్రజాసామాన్యంతో సంబంధము లేకుండా తనయొక్క గూడులోనే పార్టీ కాలక్షేపం చేస్తూ, ప్రజాసామాన్యం పార్టీని తమనాయకత్వంగా పరిగణించకుండా ఉన్నప్పుడు ప్రజలలో పార్టీకి రాజకీయ, నైతికపలుకబడి లేనప్పుడు ఆ పార్టీ నిజమైనపార్టీ కానేరదు. ఈ మధ్యనే 2 లక్షలమంది కార్మికులు పార్టీలోకి చేర్చుకోబడ్డారు. ఇక్కడ గుర్తించవలసిన విషయం ఏమిటంటే — వారంతట వారు వచ్చి పార్టీలో చేరుట జరుగలేదు. పార్టీకిచెందని కార్మికులందరూ కలసి ఈ రెండు లక్షలమందిని ఆమోదించి పార్టీలోకి పంపించారు! కనుక పార్టీలో వీరిని చేర్చుకునే విషయంలో కార్మిక ప్రజాసామాన్యమే గొప్ప బాధ్యత వహించిందని చెప్పాలి. దీనివల్ల నిరూపించబడే దేమిటి? పార్టీకిచెందని కార్మిక ప్రజాసామాన్యం మన పార్టీని వారి పార్టీగానే ఎంచి పార్టీని ఎంతో ప్రేమించుటయే గాక, తమ ప్రయోజనములకొరకే పార్టీని బలపరుస్తూ, వారి భవిష్యత్తునంతా

గొప్ప నమ్మకంతో పార్టీనాయకత్వంయొక్క చేతుల్లో పెట్టుతున్నారు. పార్టీకీ, పార్టీకి చెందని ప్రజలకు మధ్య ఈ గొప్ప నైతిక బంధాలు లేకపోయిన యెడల, పార్టీ కార్మిక వర్గముయొక్క ప్రధాననాయకుడుగా తయారు కాలేదు. కార్మికవర్గంనుంచి వేరుచేయబడ లేని ఒక భాగం పార్టీ.

"మనపార్టీ ఒక వర్గమునకు చెందినపార్టీ గనుక దాదాపు ఆ వర్గమంతా (యుద్ధ అంతర్యుద్ధ సమయాల్లో ఆ వర్గమంతా) పార్టీని అంటిపెట్టుకొని పార్టీ నాయకత్వంక్రింద కార్యక్రమం సాగిస్తూ ఉండాలి. కాని పెట్టుబడివిధానం నాశనం కానంతవరకూ, కార్మికవర్గమంతా, లేక దాదాపు కార్మికవర్గమంతా తనయొక్క నాయకుడైన పార్టీకి గల చైతన్యస్థాయికి అభివృద్ధి చెందగలదని అనుకొనుట పొరపాటు. ఈ విధంగా అభిప్రాయపడుట మెనోవలిజమ్ (నూటికి నూరువంతులు ఉపేక్షా భావమును కల్గియుండుట—గోగోల్ వ్రాసిన "నశించిన ఆత్మలు" అను గ్రంథంలో ఒక పాత్ర మెనిలోవ్) లేక బోవోస్టిజమ్ (తోకపట్టుకొని పోయే ప్రాప్తకాలజ్ఞత) అవుతుంది. పెట్టుబడి విధానంలో, కార్మికవర్గమంతా కనీసం కార్మికసంఘాలలో సంఘటితమగుట గూడా దుర్లభమేనని తెలివిగల సోషలిస్టు లందరికీ తెలిసినవిషయమే. అభివృద్ధి కానటువంటి కార్మికులందరికీ అందుబాటులో యీ ప్రజాసంఘాలున్నా—యథార్థ పరిస్థితి ఇది, నాయకత్వానికి, ప్రజాసామాన్యమునకు గల భేదాన్ని మరచిపోవుట, ప్రజాసామాన్యమును త్వరత్వరగా అభివృద్ధిచేసి హెచ్చుస్థాయికి వచ్చునట్లు చేయుటకై పార్టీ నిరంతరకృషి చేయాలని మరిచిపోవుట అంటే పార్టీని ఎదుర్కొంటున్న ప్రధాన కర్తవ్యాన్ని గుర్తించక పోవుటయే.

(లెనిన్ : కలెక్టడ్‌వర్క్సు - రష్యన్ ఎడిషన్ 6 వ సంపుటం. 305-6 వ పేజీ)

## 2. పార్టీ—కార్మికవర్గముయొక్క నిర్మాణయుక్తమైన సైనికదళం

కార్మికవర్గముయొక్క నాయకదళమే కాదు పార్టీ. నిజంగా కార్మికవర్గ పోరాటం నడపాలంటే పార్టీ తన వర్గముయొక్క నిర్మాణయుక్తమయిన సైనికదళంగాగూడా పనిచేయాలి. పెట్టుబడివిధానంక్రింద అనేకములైన క్లిష్టపరిస్థితులను, కర్తవ్యాలను పార్టీ యెదుర్కోవాలి. ఎక్కువ కష్ట పరిస్థితులలో పార్టీ శ్రామికవర్గ పోరాటాన్ని సాగించవలసి ఉంటుంది. పరిస్థితులనుబట్టి ముందుకు దాడి చేయవలసివచ్చినప్పుడు శ్రామికవర్గాన్ని ముందుకు నడపాలి. శత్రువుల బలం ఎక్కువగా ఉన్నయెడల కొన్ని సమయాల్లో తిరోగమనం చేయవలసి ఉంటుంది. పార్టీకి చెందనటువంటి, నిర్మాణములేనటువంటి అసంఖ్యాకులైన కార్మికులందరికి పోరాడే క్రమశిక్షణాపద్ధతులను నేర్పి పార్టీ వారిని ఉత్తేజపరచవలసి యుంటుంది. ఈ కర్తవ్యాలను జయప్రదంగా నెరవేర్చాలంటే, నిర్మాణ శిక్షణతో పార్టీ ఆదర్శప్రాయంగా ఉండి కార్మికవర్గముయొక్క నిర్మాణయుక్త సైనిక దళంగా తయారవాలి. ఈ నిర్మాణశిక్షణలు లేని పార్టీ అసంఖ్యాకులైన కార్మికవర్గానికి నాయకత్వమువహించలేదు. పార్టీ-కార్మికవర్గం యొక్క నిర్మాణయుక్తమైన సైనికదళం.

లెనిన్‌చే తయారుచేయబడిన ప్రఖ్యాత పార్టీ నిబంధనలలో మొదటి నిబంధన ప్రకారం, పార్టీచే నిర్మింపబడిన సంఘములన్నీ కలిసి పార్టీ అని, అటువంటి సంఘములలో ఒకదానిలో మాత్రం పార్టీ సభ్యుడని,

మొత్తం పార్టీ అంతా ఒకేఒక నిర్మాణయుక్తమైన సంస్థ అని చెప్పబడింది. కాని 1903 లోనే మెన్షివిక్కులు ఈ రకమైన నిర్వచనాన్ని అంగీకరించలేదు. లెనిన్ చెప్పిన పద్ధతికి బదులు మెన్షివిక్కులు మరొకపద్ధతిని సూచించారు. వ్యక్తులుగా పార్టీలోకి చేర్చుకునే విధానంలేక పార్టీ సభ్యత్వ 'పదవిని' పార్టీని ఏదోరకంగా బలపరచే ప్రతి "ప్రొఫెసర్ కు", "హైస్కూలు విద్యార్థికి", "సానుభూతి పరుడికి", "సమ్మెచేసిన కార్మికునికి" ప్రసాదించాలన్నారు. ఈ పద్ధతినే అవలంబించియున్నట్లయితే మనపార్టీ ప్రొఫెసర్లతోనూ, హైస్కూలు విద్యార్థులతోనూ ముంచివేయబడి ఉండేది. చివరికి నిర్మాణ శిక్షణలు లేని ఒక పెద్ద సానుభూతిపరుల ప్రవాహంలో కొట్టుకొనిపోయి ఉండేది. మెన్షివిక్కుల సూచనప్రకారం పార్టీకీ – కార్మికవర్గానికీ మధ్య భేద మేమీ లేకుండా పోయి, నిర్మాణంలేని ప్రజాసామాన్యము యొక్క చైతన్యమును అభివృద్ధిచేయు పార్టీ కర్తవ్యం విచ్ఛిన్నం అయి ఉండేది. అటువంటి వినాశకరమైన పద్ధతినే అనుసరించియున్నట్లయితే, విప్లవసమయంలో కార్మికవర్గం యొక్క సైనికదళంగా పార్టీ పనిచేసియుండేది కాదు.

"మార్టొవ్ దృక్పథం ప్రకారం పార్టీ యొక్క హద్దులు నిర్వచించబడలేదు. ప్రతి సమ్మెదారుడూ పార్టీసభ్యుడుగా ప్రకటించుకోవచ్చుననే మార్టొవ్ చెప్పేది. కాని శిక్షణలేని ఈ పద్ధతివల్ల కలిగే ప్రయోజనమేమిటి? వినాశకరంగా పార్టీ సభ్యత్వాన్ని సర్వవ్యాపితంగా ప్రకటించుటయేనా? దీనివల్ల వచ్చే గొప్ప అపాయం ఏమిటంటే కార్మికవర్గాన్ని పార్టీని కలిపి వేయుటవల్ల పార్టీ యొక్క నిర్మాణ శిక్షణలు అంతరిస్తాయి."

—(లెనిన్ : కలెక్టెడ్ వర్క్సు : రష్యన్ ఎడిషన్ 6 వ సంపుటం 211 వ పేజీ)

కాని కేవలం పార్టీసంఘాలన్నీ కలిసిన మొత్తమే పార్టీ కాదు. ఈ సంఘాలన్నీ ఒకే విధానం ప్రకారం నిర్మించబడి, మొత్తం అన్నీ, ఒకే ఒక పార్టీలో సమ్మిళితమవుతూ, పై సంస్థలు, క్రిందిసంస్థలు, కలిగి మెజారిటీని మైనారిటీ శిరసావహిస్తూ, కార్యాచరణ నిర్ణయాలన్నీ పార్టీ సభ్యులందరినీ బాధ్యులుగా చేస్తూ ఉండే ఏకైకవిధానమే పార్టీ విధానం. ఈ నియమాలు లేనప్పుడు పార్టీ ఏకైక నాయకుడుగా తయారయి కార్మికవర్గ పోరాటాన్ని క్రమశిక్షణ పద్ధతులలో నడపలేదు.

"పూర్వం నిర్మాణ ఐక్యతకలిగిన పార్టీ లేదు. అప్పుడు వేరువేరుగా ఉండే గ్రూపుల మొత్తమే పార్టీ అని పిలువబడేది. అందువల్ల ఈ గ్రూపులమధ్య సిద్ధాంత ప్రభావంమాత్రమే ఉండుటకు సాధ్యపడేది. కాని ఇప్పుడో నిర్మాణ ఐక్యతగల పార్టీగా తయారైనాం. అనగా పార్టీలో సిద్ధాంతభావాల ప్రభావానికి బదులు అధికారం ఏర్పడినందువల్ల, క్రింది పార్టీసంస్థలు పై పార్టీసంస్థలను శిరసావహించి పనిచేయవలసియున్నది."

—(లెనిన్: కలెక్టెడ్ వర్క్సు—రష్యన్ ఎడిషన్ 6 సంపుటం. 291 వ పేజీ)

మెజారిటీకి మైనారిటీ లొంగి ఉండాలనే సిద్ధాంతంవల్ల ఒక కేంద్రంనుంచి పార్టీ కార్యక్రమాన్ని నడపాలనే సిద్ధాంతంవల్ల కొంతమంది ఊగులాడే పార్టీసభ్యులనుంచి తరచుగా తిరుగుబాట్లు వస్తూఉంటాయి. నాయకత్వ నిరంకుశం అని "నిబంధనలకే ప్రాధాన్యత" ఇవ్వబడుతున్నదని దాడులు ప్రారంభ

మవుతాయి. కాని పార్టీక్రమవిధానంలో ఏకైక సంస్థగా పనిచేయాలంటే, కార్మికవర్గ పోరాటాన్ని నడపాలంటే ఈ సిద్ధాంతములు తప్పనిసరిగా ఉండితీరాలి. నిర్మాణరీత్యా లెనినిజమ్‌యొక్క అర్థం ఏమిటంటే ఈ సిద్ధాంతాలను నిర్మొహమాటంగా అమలు జరుపుటయే, ఈ సిద్ధాంతములకు వ్యతిరేకంగా చేసే పోరాటాన్ని 'రష్యన్ నిహిలిజమని' (నాస్తికత్వం), 'అధికార అరాజకత్వమని' దాన్ని రూపుమాపాలని లెనిన్ చెప్పాడు.

తనయొక్క "ఒక అడుగు ముందుకు రెండు అడుగులు వెనక్కు" అను గ్రంథములో లెనిన్ యీ ఊగులాడేవారిని గురించి ఈ క్రిందివిధంగా వ్రాశాడు:

"రష్యన్ నిహిలిస్టుయొక్క ప్రత్యేక లక్షణమే యీ అధికార అరాజకం. పార్టీ నిర్మాణమంటే ఒక ఘోరమైన ఫ్యాక్టరీ అని అతని అభిప్రాయం. మెజారిటీకి మైనారిటీ బద్ధులై ఉండుట, పార్టీలో ఒక భాగం మొత్తం పార్టీని శిరసావహించుట అంటే బానిసత్వమని అతని వుద్దేశ్యం. ఒక కేంద్రసునుంచి పని విభజన చేయడమంటే, వ్యక్తుల నందరినీ ఎక్కడి కక్కడ ఛిన్నాభిన్నము చేయడమని అతని వాదన. పార్టీ నిర్మాణ సూత్రాలంటే అతడు సహించలేక 'నియమాలు లేకుండాపోతే బ్రతుకుతాం' అని పరిహాసిస్తాడు. పార్టీ నిరంకుశ పంథానుగురించి ఇంతగా యేడుస్తూ వ్యతిరేకించేవారందరూ కేంద్రంలోవుండే వ్యక్తులమీద వారికిగల అసంతృప్తిని కప్పిపుచ్చి, యీ విధంగా ప్రవర్తిస్తారు. "కేంద్రమంటే ఒక ఈకతో సమానం. నా కోర్కెల ప్రకారం గాక, వాటికి వ్యతిరేకంగా పార్టీ కాంగ్రెసు నిన్ను నియమించింది గనుక నీవు నిరంకుశపంథాలో నడిచేవ్యక్తివి! పార్టీ కాంగ్రెసు నిబంధనలమీద ఆధారపడుటే గాని, నా అంగీకారంమీద ఆధారపడవు గనుక నీవు కేవలం నిబంధనలను పాటించే వ్యక్తివి మాత్రమే. పార్టీ కాంగ్రెసులోని మెజారిటీ సంఖ్యవల్ల వచ్చిన అధికారంతో నీవు ఒక మోటు యంత్రంగా పనిచేస్తావు. అంతే! నన్ను గూడ కమిటీలోకి తీసుకోవాలనే నా కోర్కెను గుర్తించి నాతో సంప్రదించవు నీవు నిరంకుశాధికారివి. పాతముఠా చేతుల్లో అధికారం ఉంచుటకు నీకు యెంత మాత్రం ఇష్టంలేదు." (పాతముఠా అంటే అగ్జిల్‌రాడ్, మార్టోవ్, పొట్రెసోవ్ మొదలైనవారు. వీరు పార్టీ రెండవ కాంగ్రెసులోని నిర్ణయాలకు

బదులై పనిచేయక "నిరంకుశేను" అని లెనిన్‌ను నిందించారు.)

(లెనిన్ : కలెక్టెడ్‌వర్క్సు : రష్యన్ ఎడిషన్ 6 వ సంపుటం 310-281 వ పేజీ).

## 3. పార్టీ — శ్రామికవర్గంయొక్క అత్యున్నతవర్గ నిర్మాణసంస్థ

కార్మికవర్గంయొక్క నిర్మాణయుక్తమైన సైనికదళమే పార్టీ. కానిపార్టీ ఒక్కటే కార్మిక వర్గంయొక్క నిర్మాణ సంస్థకాదు. శ్రామికవర్గానికి యింకా అనేక యితర నిర్మాణయుక్తమైన సంఘాలుకూడా ఉన్నాయి. కార్మిక సంఘాలు, సహకారసంస్థలు, ఫ్యాక్టరీ, డిపార్ట్‌మెంటల్ కమిటీలు, శాసన సభా గ్రూపులు, పార్టీకిచెందని మహిళాసంఘాలు, ప్రచురణాలయం, సాంస్కృతిక విద్యాసంస్థలు, యువజనసంఘాలు; విప్లవ పోరాటసంస్థలు, (విప్లవపోరాట సమయాల్లో పనిచేసేవి) ప్రజా ప్రతినిధులతో కూడిన సోవియట్లు (కార్మిక వర్గానికి అధికారంవచ్చినయెడల) మొదలైన అనేక సంస్థలువున్నాయి. ఇవన్నీ లేనియెడల పెట్టుబడి విధానమునకు వ్యతిరేకంగా పోరాడటం అసంభవం; వీటిలో యెక్కువభాగము పార్టీసంస్థలుకావు; కొన్నిమాత్రం పార్టీని అనుసరించి పనిచేసేవి. ఒక పరిస్థితి యేర్పడే సరికి యీ సంస్థలన్నీ అవసరమవుతాయి. అవి లేనియెడల కార్మికవర్గం వివిధ రంగాల్లో తన వర్గస్థానాన్ని బలపరచుకొనుట అసంభవమవుతుంది. అవి లేకుండా కార్మికవర్గం బలపడి బూర్జువా విధానమును తొలగించి సోషలిస్టు విధానమును ప్రవేశపెట్టలేదు. కాని, యిన్ని సంఘాలు పెట్టుకొని ఒకే ఏకైక నాయకత్వం ఎలా సాధ్యపడుతుంది? ఈ సంఘాలన్నీ బహు నాయకత్వానికి దారితీయవని గ్యారంటీ యేముంది? ఈ సంఘాలలో ప్రతి సంఘమూ తనయొక్క ప్రత్యేక రంగములోని పనిని నిర్వహించుకుంటున్నప్పుడు వాటి మధ్య ఘర్షణ యేర్పడదని వాదించవచ్చును. ఇది నిజమే. కాని ఈ సంఘాలన్నీ ఒకే మార్గం పెట్టుకొని పనిచేస్తూవుండాలనే విషయంకూడా నిజమే. ఎందుకంటే - యీ సంఘాలన్నీ గూడా ఒకే వర్గాన్ని (కార్మిక వర్గాన్ని) బలపరచే సంఘాలుగా పనిచేయాలి గనుక. అప్పుడు ఈ ప్రశ్న బయలుదేరుతుంది; ఈ సంఘాలన్నీ యే మార్గంలో, యే పంథా ననుసరించి పనిచేయాలో నిర్ణయించేదెవరు? ఆవిధంగా నిర్ణయించగల్గి, దానికి అవసరమైన అనుభవంగల కేంద్ర సంస్థ ఏది? అన్ని ప్రజా సంఘాలచేత జనరల్‌పంథా ప్రకారం పని చేయించగల ప్రతిష్ఠగల్గి నాయకత్వ పాత్రతకు దారితీసి ఘర్షణలు, చీలికలు రాకుండా చేయగల కేంద్రసంస్థ యేది?

ఈ కేంద్రసంస్థయే శ్రామికవర్గ పార్టీ.

పైన చెప్పబడిన లక్షణాలన్నీ యీ కార్మిక వర్గ పార్టీకివున్నాయి. ఎలాగంటే (1) పార్టీకి చెందని కార్మికేతర సంస్థలతో ప్రత్యక్ష సంబంధాలుకల్గి తరచుగా వాటిని నడుపుతూ వుండే కార్మికవర్గములోని ఉన్నతమైన వారందరినీ సమీకరించే కేంద్రమే పార్టీ. (2) కార్మికవర్గములోని ఉన్నతమైనవారందరి సమీకరణతో యేర్పడిన పార్టీ కేంద్రమే - తన వర్గసంస్థలన్నిటినీ నడుపగల కార్మికనాయకు లందరికి శిక్షణనిచ్చుటకు ఉన్నతమైన శిక్షణా కేంద్రం. (3) కార్మిక నాయకులందరికీ శిక్షణ నిచ్చే పార్టీ, తనయొక్క అనుభవం ప్రతిష్ఠ వల్ల కార్మికవర్గ పోరాట నాయకత్వాన్ని కేంద్రీకరించుటకు పార్టీ సంస్థలు కానటువంటి కార్మికేతర సంస్థలన్నిటిని పార్టీకి, కార్మికవర్గానికి మధ్య లింకులుగా వుండే సహాయక సంస్థలుగా మార్చుటకు తగిన

కేంద్రం. కార్మికవర్గం యొక్క వర్గ సంస్థలన్నింటిలో పార్టీ అత్యున్నతమైన నిర్మాణ సంస్థ.

దీనినిబట్టి పార్టీ సంస్థలు కాని కార్మిక సంఘాలు, సహకార సంస్థలు మొదలైనవన్నీ పార్టీ నాయకత్వానికి బద్ధులై పనిచేయాలని కాదు. ఈ సంస్థలలో పనిచేస్తూ పలుకుబడి గల పార్టీసభ్యులందరూ పార్టీ సంస్థలు కానటువంటి ఈ సంస్థలన్నిటినీ పనిద్వారా క్రమేణా పార్టీవైపుకు తీసుకొనివచ్చి పార్టీ యొక్క రాజకీయ పంథాను వాటంతట అవే అంగీకరించునట్లు చేయుటకు సర్వశక్తులా కృషిచేయాలి.

**అందువల్లనే లెనిన్ పార్టీని "శ్రామికసంస్థలన్నిటిలోకి అత్యున్నతమైన వర్గసంస్థ" అని పిలిచాడు. అటువంటి పార్టీ ఇతర కార్మికసంస్థలన్నిటిమీద రాజకీయ నాయకత్వమును కలిగి యుండుటకు కృషి చేయాలి.**

(లెనిన్ : సెలెక్టెడ్ వర్క్సు 10 సంపుటం 91 వ పేజీ)

పార్టీసంస్థలు కానటువంటి సంస్థలకు 'స్వతంత్రం' ఉండాలనీ, అవి తటస్థంగా ఉండుట అవసరమని వాదించే అవకాశవాద ద్రోహులయొక్క సిద్ధాంతాలకు, లెనినిస్టు సిద్ధాంతాలకు ఎక్కడాకుదురదు. ఆ ద్రోహుల సిద్ధాంతాల ననుసరిస్తే శాసనసభలలో 'స్వతంత్ర' సభ్యులు, పార్టీతో సంబంధంలేని పత్రికా విలేఖరులు, సంకుచిత భావాలుగల కార్మికనాయకులు, సహకార సంస్థలమీద పెత్తనంసాగించే అధికారులు, ఎందుకూపనికిరాని చెత్తాఖానీ వ్యక్తులు తయారవుతారు.

## 4. పార్టీ శ్రామిక నియంతృత్వము యొక్క సాధనం

శ్రామికవర్గంయొక్క అత్యున్నత నిర్మాణ సంస్థయే పార్టీ. శ్రామికవర్గంలోనూ, వర్గ సంస్థలలోనూ సరియైనమార్గం చూపించే ప్రధానశక్తి పార్టీ. కాని ఈపనిచేయటానికే పార్టీ ఉద్భవించిందనీ, దాని ఆశయం అంతవరకేనని, అది ఒక స్వయం పోషకశక్తి అని తలంచుట పొరపాటు. నిజమే. శ్రామికవర్గం యొక్క అత్యున్నతవర్గసంస్థయే పార్టీ. కాని అదేసమయంలో, శ్రామికవర్గ నియంతృత్వం ఏర్పడనిచోట దాన్ని ఏర్పరచుటకు, శ్రామిక నియంతృత్వం ఏర్పడినచోట దాన్ని బలపరచి విశాలపరచుటకు, పార్టీ శ్రామికవర్గం చేతుల్లో ఒకసాధనమనే విషయం మరచిపోరాదు. ఇంత ఉన్నతమైనస్థానం, ఇంత ప్రాముఖ్యత కలిగి శ్రామికసంస్థలన్నిటిలోకి అత్యున్నత సంస్థగా పార్టీ తయారగుటకు కారణం ఏమిటి? సామ్రాజ్యవాదంక్రింద తప్పనిసరిగా యుద్ధాలు, ఆర్థికసంక్షోభాలు కలిగి, శ్రామిక వర్గశక్తులన్నింటిని ఒక కేంద్రంలో కేంద్రీకరించవలసి వచ్చినందువల్ల, విప్లవోద్యమాలన్నిటినీ ఒకేచోట సమ్మేళనంచేసి, బూర్జువావర్గాన్ని కూలద్రోసి, శ్రామికవర్గ నియంతృత్వాన్ని స్థాపించవలసి వచ్చినందువల్ల, పార్టీకి ఇట్టి మహత్తర ప్రాముఖ్యత ఏర్పడుతున్నది. జయప్రదంగా అధికారాన్ని లాక్కొనుటకై శ్రామికవర్గానికి యుద్ధకమిటీగా పార్టీ అవసరం శ్రామికవర్గానికిచెందిన ప్రజాసంస్థలన్నింటిని సమీకరించగలిగి, పోరాటసమయంలో మొత్తం ఉద్యమంయొక్క నాయకత్వమునంతా కేంద్రీకరింప గలిగిన పార్టీ లేకపోయిన యెడల, రష్యాలోని శ్రామికవర్గం ఎప్పుడూ విప్లవకరమైన నియంతృత్వాన్ని స్థాపించి యుండలేకపోయేదని వేరుగా ఋజువుచేయనక్కరలేదు.

శ్రామికవర్గ నియంతృత్వమును స్థాపించుటకుమాత్రమే కాదు పార్టీ కావలసింది. సంస్థాపించిన తరువాత దాన్ని నిలబెట్టుకొని స్థిరపర్చుకొని సంపూర్ణ సోషలిస్టువిజయాన్ని సాధించుటకు గూడా పార్టీ అత్యవసరం.

"మన పార్టీలో కఠినమైనటువంటి నూటికి నూరువంతులు ఉక్కు శిక్షణ లేకపోయినట్లయితే, కార్మికవర్గం యొక్క సంపూర్ణ మద్దతు, వెనుకబడియున్న వారందరినీ ఆకర్షించి నడుపగలిగిన పలుకుబడి గల త్యాగవంతులయొక్క పూర్తి సహకారం లేకపోయినట్లయితే, బొల్షివిక్కులు రెండున్నర సంవత్సరాలు కాదుకదా, రెండున్నరనెలలు గూడా అధికారంలో ఉండలేకపోయేవారని అందరికీ తెలిసిన విషయమే."

లెనిన్, సెలక్టెడ్‌వర్క్స్-10వ సంపుటం (60వ పేజీ)

అయితే, శ్రామికవర్గ నియంతృత్వాన్ని నిలబెట్టి విశాలపరుచుట అంటే అర్థం ఏమిటి? అసంఖ్యాకులైన శ్రామికులందరిలో నిర్మాణశిక్షణా భావాలను పెంపొందించి ఉత్తేజపరచుటయే; ఛోటా బూర్జువా పార్టీలయొక్క ప్రభావాన్ని యెదుర్కొనగలిగినటువంటి, ఛోటా బూర్జువా అలవాట్లను సాంప్రదాయాలను నిర్మూలించునటువంటి ప్రచండమైన శక్తిని కార్మికులలో వృద్ధిచేయుటయే. ఛోటాబూర్జువావర్గానికి చెందిన వారందరికి తిరిగి శిక్షణఇచ్చి నూతన మానవులుగా తయారుచేయుటకై కార్మికులయొక్క నిర్మాణశక్తిని అభివృద్ధిగావించి శిక్షణ యిచ్చుటయే; వర్గములన్నిటిని నిర్మూలించి, సోషలిస్టు ఉత్పత్తివిధానమును నిర్మించుటకు తయారయ్యే శక్తిగా కార్మికవర్గమంతా శిక్షణపొందుటకు సహాయపడుటయే. కాని ఈ మహత్కార్యాల నన్నిటినీ సాధించాలంటే, గొప్ప శిక్షణా, ఐక్యతలు గల పార్టీ అవసరం.

కార్మికవర్గ నియంతృత్వమంటే, పాత సమాజశక్తులకు, సాంప్రదాయాలకు వ్యతిరేకంగా నిరంతరం సాగించవలసిన పోరాటమే. విద్యా రాజ్యాంగ విషయాల్లోనూ, మిలటరీ ఆర్థిక విషయాల్లోనూ అన్ని పద్ధతులను ఉపయోగిస్తూ- దౌర్జన్యంగానూ శాంతియుతంగానూ- ఈపోరాటాన్ని సాగించాలి. కోటాను కోట్ల ప్రజల యొక్క సాంప్రదాయిక అలవాట్ల యొక్క శక్తి ఘోరమైన అఖండశక్తి అని మరచిపోగూడదు. పోరాటంలో గట్టిపడిన ఉక్కుపార్టీ ఒకటీ లేకపోతే, కార్మికవర్గములోని న్యాయమైన వారందరికీ దృఢనమ్మకం గల పార్టీ లేకపోతే, ప్రజాసామాన్యం యొక్క మనస్తత్వాన్ని కనిపెట్టి ముందుకు నడపగల పార్టీయే లేకపోతే, ఆఘోర సాంప్రదాయముల శక్తిని ఎదుర్కొని పోరాటం సాగించుట అసంభవం అవుతుంది.

-(లెనిన్ సెలెక్టెడ్ వర్క్స్), 10వసంపుటం 84 వ పేజీ)

శ్రామికవర్గ నియంతృత్వాన్ని సంపాదించుటకు, నిలబెట్టుటకు గూడా పార్టీ శ్రామికవర్గానికి కావాలి. శ్రామిక నియంతృత్వ మొక్క సాధనమే పార్టీ.

వర్గాలు నిర్మూలించబడి కార్మిక నియంతృత్వము వీగిపోయిన రోజున పార్టీగూడా వీగిపోతుందనిగూడా దీనినిబట్టి స్పష్టపడుతుంది.

## 5. చీలికలనురూపు మాపే ఐక్యమనశ్శక్తియే పార్టీ

ఉక్కు-శిక్షణ, ఐక్యతలుగల పార్టీ లేని యెడల శ్రామికవర్గ నియంతృత్వాన్ని స్థాపించి నిలబెట్టుకొనుట అసంభవమని తెలుసుకున్నాం. కాని పార్టీలో సభ్యులందరిలో సంపూర్ణ ఐక్యకార్యాచరణ లేకుండా, పార్టీకి ఐక్యమనశ్శక్తి లేకుండా, పార్టీలో ఉక్కు-శిక్షణ ఎలా వస్తుంది? దీనినిబట్టి అభిప్రాయ భేదాలకుగూడా పార్టీలో తావులేదనుకొనుట పొరపాటు. పార్టీ శిక్షణ ఉక్కు-శిక్షణగా ఉండాలంటే అర్థం 'గుడ్డిగా' ఉంటుందని అనుకొనుటగూడా పొరపాటు. నిజంగా ఆలోచిస్తే చైతన్యముతో కూడిన శిక్షణయే నిజమైన శిక్షణ గనుక. పార్టీలో సభ్యులు వారంతటవారే మనస్ఫూర్తిగా చైతన్యంతో శిక్షణకు బద్ధులై ఉండటం అవసరం. కాని అభిప్రాయభేదముల నన్నింటినీ తర్కించుకున్న తరువాత విమర్శన పూర్తియయిన తరువాత, నిర్ణయం తీసుకున్నతరువాత పార్టీసభ్యులందరూ కార్యాచరణలో ఆ నిర్ణయానికి బద్ధులై ఉండే ఐక్యమనశ్శక్తి పార్టీలోలేని యెడల, పార్టీలో ఐక్యతగాని, శిక్షణగాని ఎలా ఉండగలవు?

"ప్రస్తుత అంతర్యుద్ధ క్లిష్ట పరిస్థితులలో కమ్యూనిస్టుపార్టీ తన కర్తవ్యాన్ని నెరవేర్చాలంటే, గొప్ప కేంద్రీకరణ పద్ధతిలో పార్టీని నిర్మించి, మిలటరీశిక్షణతో సమానమగు ఉక్కు-శిక్షణను ప్రవేశపెట్టి పార్టీ సభ్యులందరికీ సంపూర్ణ నమ్మకం కలిగి విశాలమైన అధికారంతో కూడిన శక్తివంతమైనపార్టీ కేంద్రం ఉంటుట అవసరం."

(లెనిన్: సెలెక్టెడ్‌వర్క్సు; — 10 వ సంపుటం 204 వ పేజీ)

కార్మిక నియంతృత్వము ఏర్పడకముందు పోరాటదశలో పార్టీయొక్క శిక్షణను గురించి తెలుసుకున్నాం.

శ్రామికవర్గ నియంతృత్వం స్థాపించిన తరువాతగూడా అటువంటి శిక్షణయే, అంతకంటె ఎక్కువ కఠినముగా ఉండే శిక్షణా పద్ధతులు పార్టీలో ఉండుట అవసరం.

"పార్టీయొక్క ఉక్కు-శిక్షణను ఎంతమాత్రం బలహీనపరచినా (ముఖ్యంగా నియంతృత్వకాలంలో) కార్మిక వర్గానికి వ్యతిరేకంగా, బూర్జువా వర్గానికి సహాయం చేసినట్లే అవుతుంది."

(లెనిన్: సెలెక్టెడ్‌వర్క్సు — 10 వ సంపుటం, 84 వ పేజీ)

అందువల్ల పార్టీలో చీలికలు ఉన్నట్లయితే పార్టీయొక్క ఐక్యత, శిక్షణ భగ్నం

అవుతాయి. చీలికలవల్ల పార్టీలో అనేక కేంద్రాలు తయారయి పార్టీకంతకూ ఒకే ఒక కేంద్రం లేకుండాపోయి, పార్టీయొక్క ఐక్య మనశ్శక్తి భగ్నమయి, శిక్షణ తగ్గిపోయి, శ్రామికవర్గ నియంతృత్వమే నాశనమవుతుంది.

అయితే శ్రామికవర్గ నియంతృత్వమును వ్యతిరేకిస్తూ కార్మికులను అధికార స్వీకరణకై ముందుకు నడుపుటకు యిష్టంలేనటువంటి, ఉక్కు శిక్షణతో నిమిత్తం లేనటువంటి రెండవ అంతర్జాతీయ సంస్థకు చెందిన పార్టీలు 'చీలికలు కల్గచేసే స్వేచ్ఛను' అంగీకరించవచ్చును. కాని శ్రామికవర్గ నియంతృత్వమును స్థాపించి, బలపరచుటయే ప్రధానంగా పరిగణించే కమ్యూనిస్టుపార్టీలు యిలాంటి 'స్వేచ్ఛలను' గుర్తించుటకు వీలులేదు. చీలికలు లేనటువంటి, అధికార విభజన లేనటువంటి ఐక్యతనే కమ్యూనిస్టుపార్టీలు పాటిస్తాయి.

ఈ కారణాలవల్ల కక్షుల, చీలికలయొక్క అపాయాన్నిగురించి చెపుతూ శ్రామికవర్గ నియంతృత్వం విజయవంతం కావాలంటే' మొదట కార్మిక నాయకత్వంయొక్క ఐక్యతను కాపాడాలని లెనిన్ చేసిన హెచ్చరికను పదవ పార్టీ కాంగ్రెసులో 'పార్టీ ఐక్యతమీద' అనే ఒక ప్రత్యేక తీర్మానంలో ప్రవేశపెట్టుట జరిగింది.

అందువల్లనే కక్షులను చీలికల నన్నింటిని వెంటనే రూపుమాపాలని లెనిన్ కోరాడు. అవసరమయితే యెట్టి షరతులులేకుండా కక్షలకు బాధ్యులైనవారినందరినీ పార్టీనుంచి వెళ్ళగొట్టాలనిగూడా లెనిన్ చెప్పాడు.

(లెనిన్ : సెలక్టెడ్ వర్క్స్-9 వ సంపుటం 132 వ పేజీ)

## 6. అవకాశవాద వ్యక్తులనందరినీ పార్టీనుంచి బయటికి వెళ్ళగొట్టుటవల్ల పార్టీ బలపడుతుంది

పార్టీలో కక్షులు, చీలికలు యేర్పడుటకు కారణం అవకాశవాదులే. శ్రామికవర్గం ప్రత్యేకంగా వేరుగావుండే ఒక వర్గం కాదు. రైతులనుంచి, ఛోటా బూర్జువావర్గంనుంచి పెట్టుబడి విధానం క్రింద శ్రామికులుగా మారినటువంటి విద్యార్థులనుంచి క్రొత్త క్రొత్త వారు నిరంతరం కార్మికవర్గంలోకి వచ్చి కలుస్తూ వుంటారు. అదేసమయంలో కార్మికోద్యమంలోని పై వారందరూ ముఖ్యంగా కార్మికసంఘ నాయకులు శాసన సభలలోని కార్మికసభ్యులకు వలసదేశములలో దోపిడీ ఫలితంగా వచ్చిన అపరిమిత లాభాలనుంచి బూర్జువావర్గం లంచాలిస్తూ మేత పెట్టుటవల్ల వారు క్రమేణా అవినీతిపరు లగుటకు అవకాశం వున్నది. వీరిని గురించి లెనిన్ "బూర్జువావర్గంలో చేరిపోతున్న ఈ కార్మిక జమీందారులందరికీ యేర్పడే దృక్పథాన్నిబట్టిగాని ఆదాయం వల్లగాని, వారు అనుసరించే దుర్మార్గజీవిత విధానంబట్టిగాని, సరిగా రెండవ అంతర్జాతీయసంస్థకు ప్రాపుగా వుండుటకు తగిపోతారు. ప్రస్తుత సమయంలో బూర్జువావర్గానికి సాంఘిక ఆధారంగా (మిలటరీగా కాదు) సరిపోతారు. వీరందరూ కార్మిక వుద్యమంలోని బూర్జువా యేజంట్లు. పెట్టుబడిదారులయొక్క కార్మిక సేనానాయకులైన వీరి ద్వారానే మితవాద సంస్కరణ మోసాలన్నీ జరుగుతూ ఉంటాయి." అని చెప్పాడు.

ఈ ఛోటా బూర్జువా ముఠాలన్నీ ఏదో విధంగా పార్టీలోప్రవేశిస్తాయి. వాటితో పాటు

ఛోటా బూర్జువా ముఖ్యలక్షణాలైన సందిగ్ధ స్వభావం, అవకాశవాదం, వినీతి అనిశ్చయిత్వం పార్టీలో ప్రవేశిస్తాయి. పార్టీలో చీలికలు, కక్షలు బయలుదేరుతాయి. లోపలినుంచి పార్టీని విచ్ఛిన్నం గావించుటకు ఈ లక్షణాలన్నీ దోహదమిస్తూ ఉంటాయి. ఇటువంటి 'మిత్రులను' పార్టీలో పెట్టుకొని సామ్రాజ్యవాదంతో పోరాడుట అంటే ముందునుంచి, వెనుక నుంచిగూడా ప్రమాద పరిస్థితులలో చిక్కుకొని పోవుటయే అవుతుంది. అందువల్ల అటువంటి ఛోటాబూర్జువాల నందరినీ నిర్దాక్షిణ్యంగా పార్టీనుంచి తొలగించుట మొదటి కర్తవ్యం. అప్పుడే సామ్రాజ్యవాదమునకు వ్యతిరేకంగా జయప్రదమైన పోరాటాన్ని సాగించగలం.

ఈ ఛోటా బూర్జువా అవకాశవాదులందరినీ సిద్ధాంత పోరాటంద్వారా అణచివేయవచ్చుననీ పార్టీ హద్దులలోనే వుంచి వారిని నిర్జీవం చేయవచ్చుననీ చెప్పే సిద్ధాంతం చాలా అపాయకరమైన సిద్ధాంతం. అలా చేయుటవల్ల పార్టీ విచ్ఛిన్నమయి, అవకాశవాదానికి గురి అయి, కార్మికవర్గానికి ఒక విప్లవపార్టీ లేకుండా పోవుటవల్ల, సామ్రాజ్యవాదంతో పోరాడుటకు కార్మిక వర్గానికి అవసరమైన ఆయుధం నాశనం కాగలదు. మార్టొవ్, డాన్, పోట్రెసోవ్, అక్సెల్‌రాడ్ మొదలైన వ్యక్తులందరు పార్టీలో ఉన్నట్లయితే అధికారాన్ని సంపాదించి కార్మిక నియంతృత్వం నిర్మించి, అంతర్యుద్ధంలో విజయాన్ని పొంది, పార్టీ ప్రస్తుత ఉన్నతదశకు వచ్చియుండేది కాదు. సకాలంలో పార్టీలోనుంచి ఈ అవకాశవాద ద్రోహులను, మెన్షివిక్కులను బయటికి వెళ్ళగొట్టుటవల్లనే. పార్టీసభ్యులలో అపూర్వమైన ఐక్యత పెంపొందింది పార్టీ ఐక్యతగూడా ఏర్పడింది. ఈవిధంగా మితవాదులను, అవకాశవాదులను, శాంతివాదులను, సామాజిక దేశభక్తులను పార్టీలోనుంచి వెళ్ళగొట్టుటవల్లనే కార్మికవర్గ పార్టీ వృద్ధియై బలపడుతుంది.

"పార్టీలో మితవాదులను, మెన్షివిక్కులను పెట్టుకొని కార్మికవిప్లవంలో విజయం పొందుట అసంభవం. విప్లవ విజయాన్ని నిలబెట్టుకొనుట మరింత అసంభవం. ఈ విషయం రష్యా, హంగెరీ విప్లవ అనుభవాల వల్ల చక్కగా దృఢపరచబడింది. రష్యాలో అనేకసార్లు క్లిష్టపరిస్థితులేర్పడినపుడు పార్టీలో, మెన్షివిక్కులు, మితవాదులు మొదలైన ఛోటా బూర్జువా ముఠా ఉన్నట్లయితే, తప్పనిసరిగ సోవియట్ ప్రభుత్వం కూలద్రోయబడి యుండేది. అందరికి తెలిసినట్లు ఇటలీలో ప్రభుత్వాధికారం కొరకు బూర్జువావర్గానికి కార్మికవర్గానికి మధ్య ప్రధానమైన పోరాటాలు జరుగుటకు సిద్ధంగా ఉన్నాయి. అటువంటి సమయంలో మెన్షివిక్కులను, మితవాదులను, తురాటిస్టులను పార్టీలోనుంచి వెంటనే తొలగించవలసిన అవసరం ఉంది. వారినే కాదు. పరీక్షాసమయంలో ఊగులాడవచ్చునని అనుకునే మంచి మంచి కమ్యూనిస్టులనుగూడా అన్ని బాధ్యతా పదవులనుంచి తొలగించుటవసరం. విప్లవ సమయంలో విజయంకొరకు భయంకరమైన పోరాటం సాగించినపుడు

పార్టీ సభ్యులలో బహుస్వల్ప ఊగులాట బయలుదేరినప్పటికీ అంతా నాశనమై విప్లవం అపజయం పొంది శ్రామికవర్గం చేతుల్లోంచి అధికారం లాక్కోబడుతుంది. ఎందుకంటే ఈ అధికారమింకా స్థిరపడలేదు. కార్మిక వర్గంమీద బలిష్ఠమైన దాడి జరుగుతూనే వుంది. అటువంటి పరిస్థితులలో ఊగులాడే నాయకులందరూ విసర్జించుటవల్ల పార్టీ బలహీనపడకపోవుటయేగాక పార్టీ కార్మికోద్యమం, మరియు విప్లవం అన్నీ బలపడతాయి.

—(లెనిన్: సెలెక్టెడ్ వర్క్స్. 10 వ సంపుటం 256–258 వ పేజీ)

[ప్రాబ్లమ్స్ ఆఫ్ లెనినిజం అనే గ్రంథంలోని "పార్టీ" అనే అధ్యాయం.]

పార్టీ గనుక విమర్శన, ఆత్మవిమర్శను జూచి భయపడకపోతే, తన పనిలోని పొరపాట్లను సరిదిద్ద ప్రయత్నించితే, పార్టీ పనిలోని తప్పులనుండి పాఠాలను గ్రహించి కేడర్లను ప్రబోధించితే, తన తప్పులను సకాలంలో దిద్దుకొనుట నేర్చికొనియుంటే పార్టీ అజేయ్య మవుతుంది.

పార్టీ తన తప్పును దాచుకొంటే, కఠినమైన సమస్యలను ఎదుర్కొనకుండా ఏదోవిధంగా తప్పించుకుతిరిగితే, తన లోపాలను కప్పిపుచ్చుకొని అంతా బాగానే ఉన్నదని నటించుచూవుంటే, విమర్శనను ఆత్మవిమర్శనను అది సహించలేకపోతే, అది ఆత్మసంతృప్తికి, ఆత్మస్తుతికి దారితీస్తే, తన విజయోన్మాదంలో మునిగిపోతే, పార్టీ నాశన మవుతుంది.

— సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ చరిత్రనుండి
(సి. పి. హెప్రతి – పేజీ 381)

## దురాక్రమణకు వ్యతిరేకంగా

# ప్రపంచ ప్రజాతంత్ర శక్తుల



# పురోగమనం

ఇంటర్ నేషనల్ న్యూస్ సర్వీసు యూరోపియన్ జనరల్ మేనేజరు కింగ్సుబరీస్మిత్ ప్రశ్నలకు కామ్రేడ్ స్టాలిన్ యిచ్చిన సమాధానాలు ప్రపంచమంతటా వున్న అభ్యుదయ కాముకుల మన్ననలను పొందాయి. ప్రపంచ భద్రతకోసం, శాశ్వత శాంతికోసం యావత్తు ప్రపంచంలోనూ పోరాడుతున్న నిజమైన పురోగామి ప్రజలందరియొక్క ఏకగ్రీవ ఆమోదాన్ని పొందాయి.

అమెరికా, సోవియట్ వ్యవహారాల పరిష్కార నిమిత్తం స్మిత్ తన ప్రశ్నలలో చేసిన సూచనలలో "రెండు ప్రభుత్వాలలో ఎవరికీ మరొకరిపై యుద్ధానికదిగే ఉద్దేశ్యంలేదని ధృవపరచే" సంయుక్త ప్రకటన వెలువడాలనివుంది. సోవియట్ యూనియన్‌కూ అమెరికాకు మధ్య శాంతి ఒడంబడిక జరిగేందుకు తగిన చర్యలు తీసుకోవాలనే సూచనకూడా స్మిత్ ప్రశ్నలలో వుంది.

ప్రపంచశాంతి భద్రతలను బలపరచే పంథాను ఎల్లప్పుడూ అనుసరిస్తున్న సోవియట్ ప్రభుత్వం అమెరికాతో శాంతి ఒడంబడిక చేసుకొని, దానిని ఆచరణలో పెట్టడానికీ, బెర్లిన్ సమస్యను పరిష్కరించడానికి తన ఆమోదాన్ని వెనువెంటనే తెలియజేసింది.

కాని మిస్టర్ స్మిత్ చొరవతో చేసిన సూచనలలో అమెరికాలోనూ, ప్రపంచంలో వున్న అనేక సంఖ్యాకుల అభిప్రాయాలూ, ఆశలు యిమిడి వున్నప్పటికీ ట్రూమన్ స్టాలిన్‌లు సమావేశమవ్వాలనే సూచననూ, సోవియట్‌తో శాంతి ఒడంబడిక చేసుకోవాలనే సూచననూ, అమెరికా పాలకవర్గాలు తిరస్కరించాయి.

శాంతికోసం జరిగే ప్రయత్నాలను బలపరచాలనే దృష్టితో జరుగుతున్న సంప్రతింపులను సహితం వ్యతిరేకించే పక్షంలో అమెరికాకు చిత్తశుద్ధి లేదనే అనవలసి వస్తుందని "న్యూయార్కు సన్" లాంటి పక్కా బూర్జువా పత్రిక సహితం అంగీకరించవలసివచ్చింది.

అమెరికా శాంతి ఒడంబడికను చేసుకోనేందుకు నిరాకరిస్తున్నదంటే అందులో యిక ఒకే ఒక ఉద్దేశ్యం యిమిడివుంది అదేమంటే: అమెరికా పాలకవర్గాలు అంతర్జాతీయ శాంతి

సహకారాలను విచ్ఛిన్నం పరచడానికి దృఢంగా సంకల్పించుకొని, అంతర్జాతీయ పరిస్థితులను మరింత క్లిష్టపరచేందుకు తమ యావత్ శక్తినీ వినియోగించుతున్నారు. ఈ పాలక వర్గాలు ఎన్ని అబద్ధాలు చెప్పినా, ఎంతటి అభాండాలు వేసినా, ఎన్ని పన్నాగాలను పన్నినా దురాక్రమణ విధానమే నేడు అమెరికా ప్రభుత్వం యొక్క అధికార పాలసీగా మారిందనే నగ్నసత్యాన్ని వారి ప్రచారకులు ఇక దాచలేరు.

తామనుసరిస్తున్న పాలసీలోగల ఉద్దేశానికి భంగం వాటిల్లుతుంది, కాబట్టే అమెరికా సామ్రాజ్యవాదులు శాంతి ఒడంబడికపై సంతకం పెట్టేందుకు వెనకాడుతున్నారు. సోవియట్‌తో శాంతి ఒడంబడిక చేసుకొనేందుకు బదులు అమెరికా పాలకవర్గాలు ఉత్తర అట్లాంటిక్ కూటమును ఏర్పరచాలని ఉబలాటపడుతున్నారు. అట్లాంటిక్ కూటమిలోనే వారు అంతర్జాతీయంగా అనుసరిస్తున్న దురాక్రమణ విధానంలోని అసలు భావం అంతా ఇమిడి ఉంది. మిత్రరాజ్య సమితిని కాదని అతిక్రమించుతూ వారు పశ్చిమ యూరప్‌లోనూ, మధ్యధరా సముద్ర ప్రాంతంలోనూ, మధ్య ప్రాచ్యంలోనూ, ఆసియాలోనూ దురాక్రమణ కూటములను నిర్మించుతున్నారు. ఈవిధంగా వారు మిత్రరాజ్య సమితిని త్రోసి రాజంటున్నారు. తమ పాతశత్రు దేశాలైన జపానులోనూ, పశ్చిమ జర్మనీలోనూ దురాక్రమణ శక్తులను తిరిగి త్వరత్వరగా పునరుద్ధరించుతూ, వారిని తమ దోపిడీ ప్లానులకు కీలుబొమ్మలుగా వినియోగించుకో జూస్తున్నారు. ఇదివరకే విపరీతంగా వున్న మిలిటరీ బడ్జెట్టులకు తోడు మరింత ఆయుధ బలగాల్ని పెంచడం, సైన్యాలను పెంచడం, ప్రపంచంలో అన్ని ప్రాంతాలలోనూ నావికా వైమానికా స్థావరాలను నిర్మించుకోవడం—ఇదీ నేడు అమెరికా గుత్త పెట్టుబడిదారులు అనుసరిస్తున్న విదేశాంగ విధానం. సోవియట్ యూనియన్‌నూ, నూతన ప్రజాతంత్ర రాజ్యాలనూ ఆ విధంగా వేరుపరచి చక్రబంధం చేయాలని అమెరికా యుద్ధోన్మాదులు పన్నాగం పన్నుతున్నారు.

శిథిలమైన హిట్లర్ జర్మనీలో సమాధి కట్టబడిన ప్రపంచాధిపత్యంకోసం జరిగిన ఫాసిస్టు ప్లానులను ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు తిరిగి పునరుద్ధరించడానికి ప్రయత్నాలు చేస్తున్నారని పై యథార్థ సంఘటనలన్నీ చాటి చెప్తున్నాయి.

పతనమవుతున్న పెట్టుబడిదారీ విధానం రోజురోజుకు చిక్కుకుపోతున్న తమయొక్క ఆంతరంగిక పరస్పర విరుద్ధతలను యుద్ధం మూలంగానూ, ప్రజలను బానిసత్వంలో ముంచి దోపిడీ సాగించడం మూలంగానూ పరిష్కరించుకోవాలని సామ్రాజ్యవాదులు ప్రయత్నించుతున్నారు. దురాక్రమణ సంఘాలనూ, కూటములను ఒకవేపున ఏర్పరచుకుంటూ సామ్రాజ్యవాదులు మరోవైపునా తమ దేశాలలోని ప్రజాతంత్ర ఉద్యమాలనూ, వలస దేశాలలోవున్న జాతీయ విముక్తి ఉద్యమాలను నాశనం చేయడానికి పూనుకుంటున్నారు. పరిమితిలేని తమ నియంతృత్వాన్ని స్థాపించుకొనేందుకు పారిశ్రామిక గుత్త పెట్టుబడిదారీ వర్గాలు ప్రజాతంత్ర పౌరసత్వహక్కులన్నింటినీ నిషేధించుతున్నారు. దురాక్రమణ రాజ్యాల కూటములను నిర్మించుతూ, ఆయుధ బలాన్ని తెగపెంచుకుంటూ విపరీతంగా ఆను

రాను చూపెడుతున్న నూతన యుద్ధ ప్రేరేపకులు! యీ చర్యలన్నీ సామ్రాజ్యవాదుల కూటమియొక్క బలహీనతను రుజువు చేస్తున్నాయిగాని బలాన్ని ఎంతమాత్రమూ రుజువు చేయడంలేదు.

పెట్టుబడిదారీ దేశాలలోని ఆర్థిక పరిస్థితులలోని విషమస్థితి సామ్రాజ్యవాదంలో రోజురోజుకు వృద్ధిపొందుతున్న పరస్పర విరుద్ధతలను మరింత అధికం చేస్తున్నాయి. ఇతర దేశాలను బానిసత్వంలో ముంచడంద్వారా తన ఆర్థిక సంక్షోభాన్ని పరిష్కరించుకోవాలని వాల్ స్ట్రీట్ (అమెరికా) పెట్టుబడిరాశులు తాపత్రయ పడుతున్నప్పటికీ, ఈ సంక్షోభం మరింత ఉధృతంగా అమెరికా గుమ్మంముందు విలయ నృత్యం చేస్తోంది. అమెరికా పరిశ్రమలలో యుద్ధానంతరం వచ్చిన ఉత్పత్తి పెరుగుదల కూడా తగ్గిపోతోంది. అధికారికంగా ప్రకటించబడిన లెక్కలే దేశంలోని ఆర్థిక పరిస్థితి బాగా క్షీణించినదని తెలుపుతున్నాయి. పారిశ్రామిక ఉత్పత్తిలోనూ, కరెన్సీ చెలామణిలోను తగ్గుదల, దివాళాలు ఎక్కువవడం, టోకు అమ్మకపుధరలు బాగా పడిపోవడం, రైతుల ఆదాయం తగ్గిపోవడం, నిరుద్యోగం విపరీతంగా పెరగడం—యివన్నీ ఉదాహరణలు. ఫిబ్రవరి 4 న తేదీన ప్రకటించబడిన స్టాటిస్టిక్సు బ్యూరో ప్రకటించిన లెక్కలు ప్రకారం నిరుద్యోగులసంఖ్య గత డిసెంబరుకంటే మరో 7 లక్షలు పెరిగింది.

ఇక మార్షల్ 'సహాయాన్ని' తీసుకొంటున్న దేశాలలోని స్థితిగతులు మరింత అధ్వాన్నంగా ఉన్నాయి. ఇటలీలో దాదాపు 30 లక్షలమంది పిల్ల బెల్జియంలోనే 3 లక్షల మంది, హాలండులో 2 లక్షలకు పైగా నిరుద్యోగులు తయారయ్యారు. బ్రిటన్ దినదిన గండంగావున్న తన ఆర్థిక పరిస్థితులతో శతమత మవుతోంది. శాంతికాలంలో దాని వ్యాపారాలలోటు ఎన్నడూ లేనంత విపరీతమైన దశలో పడింది.

"ట్రూమన్ సిద్ధాంతం" "మార్షల్ ప్లానూ" మార్షల్ దేశాలలోని పరిస్థితులను మరింత విషమస్థితికి తెచ్చాయి. ఈ ప్లానులు అమెరికాలోని ఆర్థిక దుస్థితిని సహితం చక్కబరచలేక పోయాయి. ఈ సంక్షోభాన్ని తప్పించుకోవాలనే ప్రయత్నంతో అమెరికా గుత్త పెట్టుబడిదారులు తమ దురాక్రమణ విస్తరణ విధానాన్ని మరింత తీవ్రతరం చేస్తున్నారు. ట్రూమన్ద్వారా వెనుకబడిన ప్రాంతాలకు ఎగబడుతున్నారు పశ్చిమ యూరప్ మార్షల్ ప్లానుతో ముంచడంతో తృప్తిపడక మొత్తం ప్రపంచాన్నే మార్షల్ పథకం క్రిందకు తీసికొని రావాలని ప్రయత్నించుతున్నారు.

ఈ విధానానికి సరిగ్గా పూర్తి వ్యతిరేక విధానాన్ని అంతర్జాతీయ రాజకీయ రంగంలో సోవియట్ యూనియన్నూ, నూతన ప్రజాతంత్ర రాజ్యాలూ అనుసరిస్తున్నాయి. ఈ విధానం ప్రపంచశాంతి భద్రతలను కాపాడేందుకు బలాన్ని చేకూరుస్తున్నాయి. సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాతంత్ర కూటమికి నాయకత్వం వహిస్తున్న సోవియట్ యూనియన్ యొక్క లెనిన్-స్టాలిన్ల విదేశాంగ విధానాన్ని అభ్యుదయ మానవజాతి అంతా హృదయపూర్వకంగా బలపరుస్తోంది. "మన శాంతియుతమైన విధానాన్ని ప్రపంచంలోని అత్యధిక సంఖ్యాకులు ఆమోదిస్తున్నారు" అన్న లెనిన్ మహాశయుని మాటలను ప్రతిరోజూ జరుగుతున్న సంఘటనలు రుజువు చేస్తున్నాయి. ఎందువల్లనంటే సోవియట్ యూనియన్ అనుసరించే విదేశాంగ విధానం కష్టజీవులందరి ప్రధానమైన, ముఖ్య ప్రయోజనాలకు అనుగుణ్యమైనది.

ప్రజలలోని ప్రజాతంత్ర కరమైన దేశభక్తియుతమైన శక్తుల నన్నింటినీ ఐక్యంచేస్తూ

కమ్యూనిస్టుపార్టీలు సామ్రాజ్యవాదులు పన్నుతున్న అనేక దురాక్రమణ పన్నాగాలనూ, కుతంత్రాలను భగ్నపరచి, శాంతికోసం జరిగే పోరాటంలో అత్యద్భుతమైన విజయాలను సాధించాయి. ప్రజలయొక్క జాతీయతను ప్రోత్సాహమిస్తూ, కమ్యూనిస్టుపార్టీలు యుద్ధప్రేరేపకుల యిటీవలి చర్యలన్నింటికీ వ్యతిరేకంగా ప్రజానీకాన్ని సమీకరణ చేస్తున్నాయి. శాంతికోసం నిలబడుతున్న శక్తులు ఒక సైన్యంలా తయారవుతున్నాయి. అవి ప్రపంచంలోని అన్నిభాగాలలో రోజు రోజుకు వృద్ధిపొందుతూ, బలపడుతున్నాయి.

ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ సినా డిపార్టుమెంటు సమావేశంలో మాట్లాడుతూ "మా దేశంలోని శాంతికాముకులందరికీ-వారి నమ్మకాలేవైనా సరే-వారు శాంతిని ప్రేమించి, శాంతి, ప్రజాతంత్రంలకోసం పోరాడటానికి సిద్ధపడితే అంతేచాలు - వారందరినీ ఐక్యంచేసి పోరాడుతాం." అని కామ్రేడ్ మారిస్ థోరెజ్ ఉద్ఘాటించాడు.

ఇటలీ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం ఒక ప్రకటనచేస్తూ ఇటలీప్రజ లంతా శాంతికోసం తమకుగల తహతహను దృఢంగా వెలిబుచ్చి, సామ్రాజ్యవాదుల చేతులలో ఇటలీని కీలుబొమ్మగా తయారుచేసే యావత్తు ప్రయత్నాలను ఎదుర్కోవాలని ఇటలీ ప్రజలకు పిలుపునిచ్చింది.

ఇతర దేశాలలోని కమ్యూనిస్టు పార్టీల నాయకులుకూడా యిలాంటి ప్రకటనలనే చేశారు. వారిని అనేక ప్రజాతంత్రయుతమైన ప్రజాసంస్థలూ, అభ్యుదయకాముక వర్గాల ప్రతినిధులూ బలపరచారు.

శాంతికోసం జరుగుతున్న యీ పోరాటంలోకి కష్టజీవులకుచెందిన వర్గాలు రోజుకు రోజుకువచ్చి చేరుతున్నాయి. యుద్ధకాలంలో ఫాసిజానికి వ్యతిరేకంగా తాము ప్రథమశ్రేణిలో నిలబడినట్లుగానే యీనాడుకూడా కమ్యూనిస్టులు శాశ్వత శాంతికోసం, ప్రజాతంత్రం, సోషలిజంలకోసం జరిగే మహాపోరాటంలో జనసామాన్యాన్ని సంఘటితపరచడమే తమ కర్తవ్యంగా ఎంచుకొని, యుద్ధోన్మాదుల కుట్రలను బహిర్గతంచేస్తూ రోజు రోజుకు నూతనంగా ప్రజలను పోరాట సంఘటనలోకి తీసుకొన్నారు.

**అమెరికా సామ్రాజ్యవాదుల దురాక్రమణ ప్లానులకు బాకాలూదే మితవాద సోషలిస్టుల మోసాన్ని బట్టబయలు చేసేందుకు యింకా ఎక్కువ కృషిని చేయవలసిన ఆవశ్యకత నేడుంది. సోవియట్ యూనియన్‌పైనా, నూతన ప్రజాతంత్ర రాజ్యాలపైనా వారు చేస్తున్న దుర్మార్గపు దాడులను బట్టబయలు చేయవలసి ఉంది; సామ్రాజ్యవాదుల దురాక్రమణ తత్వాన్ని మరుగుపరచి, సోవియట్ యూనియన్ చేసే శాంతి ప్రయత్నాలకు అపార్థాలు కల్పిస్తూ శాంతిసంఘటనను బలహీనపరచడానికి వారు చేసే అబద్ధపు తప్పుడు ప్రచారాన్ని ఎదుర్కోవాలి.**

ప్రజలు దృఢసంకల్పంతో మహత్తరమైన సోషలిస్టుభూమి నాయకత్వాన ప్రజాతంత్ర కూటమిని ఆర్గనైజుచేసి సంఘటితపరచిన సామ్రాజ్యవాద దురాక్రమణదారుల పన్నాగాలన్నీ భగ్నంకాక తప్పవు. కామ్రేడ్ స్టాలిన్ చెప్పినట్లు "ఇటీవల ముగిసిన ప్రపంచ యుద్ధంయొక్క భయంకర దృశ్యాలు యిప్పటికీ సజీవంగా

ప్రజల కండ్లకుకట్టినట్లు కనిపిస్తూనే ఉన్నాయి శాంతి నభిలషిస్తోన్న బ్రహ్మాండమైన నేటి సాంఘిక శక్తుల నతిక్రమించడం దురాక్రమణకు చిందులు తొక్కుతున్న చర్చిల్ శిష్యవర్గానికి సాధ్యపడని సంగతి కాబట్టి మరో నూతన యుద్ధాన్ని కల్పించడం వాళ్లకు సాధ్యమయ్యే పనిగాదు."

—కొమిన్‌ఫారం పత్రిక సంపాదకీయం [ 15—2—1949 ]

---

"బూర్జువారాజ్యాంగ పద్ధతులు పైకి వివిధరకాలుగా ఉన్నా మొత్తంమీద వాటిలోని సారాంశం మాత్రం ఒకటే. అంతిమదశలో ఆ రాజ్యాంగపద్ధతులన్నీ తప్పకుండా బూర్జువా నియంతృత్వంగానే పరిణమిస్తాయి."

— లెనిన్

(ప్రాబ్లెమ్స్ ఆఫ్ లెనినిజం : పేజి 636)



# పరిశ్రమలను జాతీయం చేయడంపై కామ్రేడ్ లెనిన్

— ఒక ఆర్థిక శాస్త్రవేత్త

I

భారత కమ్యూనిస్టుపార్టీ పొలిటికల్ థీసిస్‌లో "ప్రజాతంత్ర విప్లవ కార్యక్రమం" అనే భాగంలో యీ క్రిందివిధంగావుంది.

"(10) బ్యాంకులలోను, పరిశ్రమలలోను, గవాణాలలోను, టీ, కాఫీ వగైరా తోటల లోను, గనులు మొదలైనవాటిలోను వున్న విదేశీ పెట్టుబడుల నన్నిటిని ప్రభుత్వం వశపర్చుకోవాలి. ఆ సంస్థలను జాతీయం చేయాలి.

"(11) పెద్ద పరిశ్రమలు, పెద్ద బ్యాంకులు, ఇన్సూరెన్సు కంపెనీలు జాతీయంచేయాలి. వాటిపై కార్మికుల పెత్తనానికి, కనీసజీతానికి, రోజుకు 8 గంటలపనికి గ్యారంటీ కల్పించాలి.

"(12) భారతదేశంలోవున్న సాధన సంపత్తిని అభివృద్ధి చేయడానికి, బడాపెట్టుబడిదారులను ఆర్థికంగా కీలకస్థానాల నుంచి తొలగించడానికి ఒక ఆర్థిక ప్రణాళికను తయారుచేయాలి. వ్యక్తుల చేతుల లోవున్న పరిశ్రమల్లో లాభాలను కంట్రోలు చేయాలి."

వీటిపై కొందరు కొన్ని ప్రశ్నలను లేవదీస్తున్నారు. పై వాటిలో గీతలుగీసిన మాటలను తీసుకొని, వాటి అర్థం సామ్రాజ్యవాదుల పెట్టుబడులు మాత్రమే వశపర్చుకోవడమనీ, భారత పెట్టుబడులు వశపరచుకోబడవనీ, పెద్ద పరిశ్రమలను జాతీయం చేయడమంటే, పరిశ్రమలను, కార్మికుల పెత్తనం మొదలైనవాటిని ఆర్గనైజు చేసిపెట్టడమేగాని వశపర్చుకోవడం కాదనీ, (పరిహారం ఇవ్వడానికి అవకాశం వుందని); ఆర్థికంగా కీలక స్థానాలలోనుంచి బడా పెట్టుబడిదార్లను తొలగించాలనడం

గుత్త పెట్టుబడిని వశపర్చుకోవడం ద్వారా దెబ్బకొట్టి నాశనం చేయడానికీ కాదనీ వ్యాఖ్యానాలు చేస్తున్నారు.

పై కార్యక్రమాన్ని ఆ విధంగా అర్థం చేసుకోవడం సరియైనదేనా? ఆ దృక్పథం, ఆ కార్యక్రమం మార్క్సిజం అనుకోవచ్చునా?

## II

వివిధ దశలలో బోల్షివిక్కుల కార్యక్రమాలు వాటిలో పరిశ్రమలను జాతీయం చేయడమనే సమస్యకున్న ప్రాధాన్యతఏమిటో గతితార్కిక సిద్ధాంత రీత్యాగాని, చారిత్రక దృష్ట్యాగానీ అర్థంచేసుకోకుండా చిలక పలుకులవలె వల్లించడం మూలంగా ఒక్కొక్కపుడు అలాంటి వ్యాఖ్యానాలు బయలుదేరుతాయి. అదే సరియైనవిధంగా అర్థంచేసుకోడం అనుకుంటారు.

ఈ సందర్భంలో బోల్షివిక్కుల కార్యక్రమాలు ఏమిటో, వాటిపై లెనిన్ ఏమి చెప్పాడో ఒకసారి పునశ్చరణ చేసుకోడం మంచిది.

1905 విప్లవంలో రష్యన్ బూర్జువావర్గం విప్లవ వ్యతిరేక పక్షాన్ని చేరకమునుపే, లెనిన్, బూర్జువా ప్రజాతంత్ర విప్లవం కార్మికవిప్లవంగా మారాలిఅనే నినాదాన్ని లేవదీశాడు. ఈ నినాదమే 1915_17 సంవత్సరాలలో ఇంకా విపులీకరించబడింది. 1917 ఫిబ్రవరి, అక్టోబరు నెలల మధ్య బోల్షివిక్కు కార్యక్రమంలో ప్రాధాన్యత వహించింది.

స్టాలిన్ తన సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ చరిత్ర అనే గ్రంధంలో, 1905 ఏప్రిల్‌లో జరిగిన మూడవ పార్టీ కాంగ్రెసును గురించి ఇలా రాశాడు:

“మూడవపార్టీ కాంగ్రెసు నిర్ణయించిన ఎత్తుగడ ఇది. విప్లవం బూర్జువా ప్రజాతంత్ర స్వభావం కలిగివున్నప్పటికీ ఆ పరిస్థితులలో అది పెట్టుబడిదారీ విధానపు హద్దులనుమించి ఎక్కువ పురోగమించ జాలక పోయినప్పటికీ కూడ . అర్థికవర్గం ఆ విప్లవాన్ని విజయవంతం కావాలని కోరుతుంది. ఎందుచేతనంటే ఆ విప్లవ విజయం కార్మికవర్గం సంఘటితపడడానికి, రాజకీయంగా అభివృద్ధి చెందడానికి శ్రామికులు అనుభవం సంపాదించి రాజకీయ నాయకత్వం వహించే సామర్థ్యంపొందడానికి, యీ బూర్జువా ప్రజాతంత్ర విప్లవంలోనుంచి సోషలిస్టు విప్లవంలోకి పురోగమించడానికి అవకాశాన్ని కల్గిస్తుంది.”

బోల్షివిక్కుల ఎత్తుగడలను వివరించడం కోసం రాసిన “రైతుసమస్యపై సోషల్ డెమాక్రాట్ల (బోల్షివిక్కులు) దృక్పధం” అనే వ్యాసంలో లెనిన్ ఇలా అన్నాడు.

“...ప్రజాతంత్ర విప్లవంలోనుంచి మనం వెంటనే సోషలిస్టు విప్లవంలోకి దిగుతాం. మనకున్న బలం, కార్మికవర్గ చైతన్యం నిర్మాణం వీటినిబట్టి ఆ నడక వుంటుంది. విప్లవం నిరాటంకంగా కొనసాగడమే మన ధ్యేయం. సగంలో ఆగడం అనేదివుండదు.”

ఈ వాదననే ఇంకా ముందుకు తీసుకుపోతూ లెనిన్ ఇలా అన్నాడు: “ఒక రకంగా ఆలోచిస్తే, బూర్జువావిప్లవం, ఆ వర్గానికంటె కార్మికవర్గానికే ఎక్కువ ఉపయోగకరంగా వుంటుంది.”

ఈ సందర్భంలో మనం ఇంకొక విషయాన్నికూడా గమనించాలి. 1905 నాటికి లెనిన్ ఇంకా, సామ్రాజ్యవాదం లేక గుత్త పెట్టుబడిదారీ విధానం తన అవసానదశకు వచ్చిందిగాని, సర్వవ్యాపిత సంక్షోభదశలో వున్నదనిగాని సిద్ధాంతీకరించలేదు.

ప్రజాతంత్రవిప్లవం బూర్జువా వర్గానికంటె కార్మికవర్గానికే లాభదాయకమని అనడంలో

లెనిన్ ఉద్దేశం ఇది పెట్టుబడిదారీ విధానాన్ని సంపూర్తిగా అభివృద్ధిచేయడంలో బూర్జువా వర్గంకంటె కార్మికవర్గమే ఎక్కువ శ్రద్ధ వహిస్తుంది. ఎందుచేతనంటే పెట్టుబడిదారీ విధానపు అభివృద్ధిలో Archaic ఫ్యూడల్ పద్ధతులన్నీ తొలగింప బడతాయి. వర్గ పోరాటం ఉధృతంగా సాగించడానికి మార్గం ఏర్పడుతుంది.

లెనిన్ ఇలా వ్రాశాడు:

"...రష్యాలాంటి దేశాలలో కార్మికవర్గం పెట్టుబడిదారీ విధానంవల్లకంటె, అది సరిగా అభివృద్ధి చెందకపోవడంవల్లనే ఎక్కువబాధ పడుతూంది. అందుచేత అక్కడి పెట్టుబడిదారీ విధానం ఎక్కువ విశాలవంతంగాను, స్వేచ్ఛగాను, తొందరగాను అభివృద్ధి చెందాలని కార్మికవర్గం నిశ్చితంగా అభిలషిస్తోంది. పెట్టుబడిదారీ విధానపు అభివృద్ధికి అటంకాలుగావుండే పాతపద్ధతియొక్క అవశేషాలనన్నింటిని తొలగించడమనేది కార్మిక వర్గానికి లాభదాయకం. బూర్జువావిప్లవం ఆ పాత కాలపు ఫ్యూడల్ బానిసవిధానాన్ని నిరవశేషంగా నిర్మూలిస్తుంది. ఫ్యూడల్ నిరంకుశత్వమేగాకుండా రాచరికాలుకూడా తొలగింపబడతాయి. పెట్టుబడిదారీ విధానం విశాలవంతంగాను స్వేచ్ఛగాను, తొందరగాను అభివృద్ధిచెందేటట్లు చేస్తుంది.

"అందుచేత బూర్జువావిప్లవం కార్మిక వర్గానికే అత్యంత ఉపయోగకరం. కార్మికవర్గ ప్రయోజనం నెరవేరడానికి బూర్జువా విప్లవం రావడం తప్పనిసరిగా అవసరం. బూర్జువా విప్లవం ఎంత దృఢనిశ్చయంతోనూ ఎడతెగకుండాను, ఎంత సంపూర్ణంగాను కొనసాగింపబడుతుందో, అంత గ్యారంటీగాను కార్మికవర్గం సోషలిజంకోసం బూర్జువావర్గానికి వ్యతిరేకంగానూ పోరాటం సాగించగల్గుతుంది. ఇలాంటి నిర్ణయానికి రావడం కొందరికి చాలా కొత్తగాను, వింతగాను, విపరీతంగాను కనపడవచ్చు. అయితే వారికి శాస్త్రీయసోషలిజపు సూత్రాలు ఏమీ తెలియవని చెప్పాలి. ఈ సిద్ధాంతాన్నిబట్టే, ఒక దృష్టితో చూస్తే బూర్జువా విప్లవం ఆ వర్గానికంటె కార్మికవర్గానికే ఎక్కువ ఉపయోగకరం అనే సిద్ధాంతం వస్తుంది. ఈ క్రింది విధంగా ఆలోచిస్తే పై సిద్ధాంతం చాలా సరియైనదేనని బోధపడుతుంది, కార్మికవర్గానికి వ్యతిరేకంగా, కొన్ని పాత పద్ధతులను నిలబెట్టుకోడం బూర్జువా వర్గానికి అవసరం.

ఉదాహరణకు రాచరికం, శాశ్వతంగా కొంత సైన్యాన్ని పెట్టుకోడం మొదలైనవి. బూర్జువా విప్లవం ఆ పాత పద్ధతులన్నిటిని పూర్తిగా తుడిచిపెట్టకుండా కొన్నిటిని ఇంకా వుంచితే అది బూర్జువావర్గానికి లాభం. అంటే బూర్జువావిప్లవం కృతనిశ్చయంతోను, విరామం లేకుండాను కొనసాగింపబడి, పూర్తిగావింపబడకపోతే బూర్జువావర్గానికి మంచివీలు. బూర్జువా ప్రజాతంత్రానికి కావలసిన మార్పులు మెల్లగాను, క్రమక్రమంగాను, విప్లవంద్వారా కాకుండా సంస్కరణల ద్వారాను జరిగినట్లయితే అది బూర్జువావర్గానికే ఎక్కువ ఉపయోగం. ఈ మార్పులు బానిసవిధానానికి మూలకందమై దెబ్బకొట్టడానికి అనువుగావుండే రాచరికంలాంటి వ్యవస్థను నిర్మూలించకుండా ఎంత వీలైతే అంతా వుండనిచ్చినా, ప్రజాసామాన్యంయొక్క, ముఖ్యంగా కార్మికులయొక్క చొరవను, శక్తిసామర్థ్యాలను విప్లవాత్మకమైన స్వతంత్ర చర్యలను అభివృద్ధిగాకుండా అణచిపెట్టినా అది బూర్జువావర్గానికే లాభకరం. అలా అరికట్టబడకుండా కార్మికులకు యీ అవకాశాన్ని యిచ్చినట్లయితే బూర్జువా విప్లవం వారి చేతులలో పెట్టే తుపాకులనే ఆ వర్గానికి ఎదురు తిప్పగలుగుతారు. ఆ విప్లవం యిచ్చే స్వాతంత్ర్యాన్ని పూర్తిగా వినియోగించు కొనగల్గుతారు.

అప్పుడు నెలకొల్పబడే ప్రజాతంత్ర సంస్థలు బానిసవిధానాన్ని పూర్తిగా తుడిచిపెడతాయి.”

అందుచేతనే లెనిన్, తమ కమ్యూనిస్టుపార్టీ మూడవ కాంగ్రెసులో ఎత్తుగడలను గురించిన నినాదాలు నిర్ణయించేటప్పుడు పరిశ్రమలను జాతీయం చేయాలనే నినాదం ఇవ్వలేదు.

“కార్మిక వర్గానికి దినానికి 8 గంటలపని ఇతర అత్యవసర కోర్కెలు వెంటనే ఒక విప్లవకర మార్గంలో సాధింపబడాలి” అనే నినాదం ఇచ్చాడు.

ఈ నినాదం ఎంత అద్భుతమైన విప్లవకర పాత్రను వహించిందో, స్టాలిన్ సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ చరిత్రలో వివరించాడు. ఆయన ఇలా రాశాడు.

“...పట్టణాలలో రోజుకి 8 గంటల పని, పల్లెప్రాంతాలలో ప్రజాస్వామిక మార్పులు, వీటిని ఒక విప్లవకరమైన పద్ధతిలో సాధించాలి అనే నినాదం ఎలాంటి ఎత్తుగడో చూడండి. ఆ పద్ధతి అవలంబించడంలో అధికారులను లెక్కచేయ నవసరంలేదు. వారి శాసనాలను పాటించ నవసరంలేదు. వాటన్నిటిని ధిక్కరించి ఒక కొత్త వ్యవస్థను నెలకొల్పడం అన్న మాట. ఇది ఒక కొత్త ఎత్తుగడ. దీనిని అవలంబించడంతో జారు ప్రభుత్వయంత్రం స్తంభించి పోయింది. దానిశక్తి వీగిపోయింది. ప్రజల చొరవశక్తి సామర్థ్యాలకు కావలసినంత స్వేచ్ఛ లభించింది. ఈ ఎత్తుగడవల్ల పట్టణాలలో అనేక విప్లవ సమ్మెకమిటీలు బయలుదేరాయి. గ్రామీణ ప్రాంతాలలో విప్లవకర్షక కమిటీలు నెలకొన్నాయి. తరువాత యీ సమ్మెకమిటీలే కార్మిక సోవియట్లుగా పెంపొందాయి. రైతు కమిటీలు రైతు సోవియట్లుగా అభివృద్ధి చెందాయి.”

ఇది దేనిని తెల్పుతోంది? ఆ కాలానికి అనుగుణ్యంగా రష్యన్ కమ్యూనిస్టుపార్టీ మూడవ కాంగ్రెసు ఇచ్చిన నినాదాలు సరియైనవేనని చరిత్ర ధృవపర్చింది.

## III

1905 విప్లవం ఓడిపోయిన తరువాత 1917 వరకూ వున్న మధ్యకాలంలో లెనిన్ సామ్రాజ్యవాదయుగం పెట్టుబడిదారీ విధానపు అంత్యదశ అనీ, పెట్టుబడిదారీవిధానం అభివృద్ధిఅయ్యే అవకాశాల నన్నింటిని కోల్పోయిందనీ, సర్వవ్యాపిత సంక్షోభంలో పడిందనీ, అంటే విప్లవగర్భితమైన సామ్రాజ్యవాదయుద్ధం తప్పదని సిద్ధాంతీకరించాడు. 1905 విప్లవంతరువాత రష్యాలో బూర్జువా వర్గం విప్లవ వ్యతిరేక పాత్రను ధరించిందని స్పష్టీకరించాడు. 1917 ఫిబ్రవరి విప్లవంతో అధికారంలోకి వచ్చిన ప్రభుత్వాన్నిగురించి లెనిన్ తన “ప్రవాసిలేఖలు”లో ఇలా రాశాడు:

“రష్యాలో ఒక కొత్తవర్గపు ప్రతినిధులు రాజకీయ అధికారం చేబట్టారు. వీరు మనదేశాన్ని చాలాకాలంనుంచి ఆర్థికంగా పరిపాలించుతూ వుండిన రైతు పెట్టుబడిదార్లు, బూర్జువావర్గము. ఈ వర్గం 1905-7 మధ్యకాలంలోను, 1907-14 మధ్యనున్న అభివృద్ధి నిరోధక కాలంలోను ఆ తరువాత, ముఖ్యంగా యుద్ధకాలంలోను (1914-17) రాజకీయంగా త్వరత్వరగా అగ్రసైజా అయి చొచ్చుకుపోయారు. నిజానికి 1917 నాటికే యీ వర్గం అధికారంలో వుంది. అందుచేత జారువిధానంపై కొట్టిన తొలిదెబ్బలే దీనిని కూడా కూలగొట్టడానికి బూర్జువావర్గానికి మార్గాన్ని సుగమం చేయడానికి సరిపోతాయి.”

అలాంటి పరిస్థితుల్లో విప్లవోద్యమం నేరుగాగా బూర్జువావర్గానికి వ్యతిరేకంగానే

పురోగమించాలి. అంటే విప్లవానికి సోషలిస్టు స్వభావంవస్తుంది. ఈ లోపుగా పెట్టుబడిదారీ విధానంలో పెరిగే గుత్తపద్ధతి, సిండికేట్లు ట్రస్టులు వగైరాలు, అంతా ప్రభుత్వ గుత్త పెత్తనంక్రిందికి తెచ్చుకోవాలనేధోరణి. ఇవన్నీ కొత్త నినాదానికి దారితీస్తాయి. "8 గంటల పనిని విప్లవకరమైన మార్గాలలో సాధించాలి" అనే నినాదాన్ని మించి మరో అడుగుముందుకు పోవలసివస్తుంది.

అందుచేతనే ఏప్రిల్ థీసిస్‌లో యీ క్రింది నినాదాలు ఇవ్వబడ్డాయి.

"(7) దేశంలోనున్న బ్యాంకులన్నీ ఒకే జాతీయ బ్యాంకిగానే మేళన మొనర్చబడాలి. ఆ జాతీయ బ్యాంకిపై కార్మిక సోవియట్లకు పూర్తి అధికారం వుండాలి."

"(8) మనం వెంటనే చేయవలసినపని సోషలిజాన్ని 'ప్రవేశపెట్టడం' కాదు. సమాజంలోని ఉత్పత్తిని, సరకుల పంపకాన్ని తక్షణమే కార్మిక సోవియట్ల అధీనంలోకి తీసుకరావాలి."

దీని విషయమై 1917 నవంబరు విప్లవం వరకూ కూడా లెనిన్ ఒక సంగతి పదేపదే నొక్కిచెబుతూవచ్చాడు. స్వరూప రీత్యా చూస్తే యీ కార్యక్రమం పెట్టుబడిదారీ విధానపు హద్దులను మించిపోయింది కాదు. అని ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారీ విధానపు కార్యక్రమమే. సామ్రాజ్యవాద యుద్ధ కాలంలో కొన్ని పెట్టుబడిదారీ దేశాలలో - ముఖ్యంగా జర్మనీలో - ఈ పద్ధతి ప్రవేశ పెట్టబడింది. అయినప్పటికీ ఇక్కడ మనం ఇంకోవిషయాన్నికూడా గుర్తుంచుకోవాలి. అంతా ప్రభుత్వ గుత్తపెట్టుబడి క్రిందికి రావడమంటే సోషలిజానికి కావలసిన పరిస్థితులు పూర్తిగా పరిపక్వం చెందాయన్నమాట.

"రానున్న ఉపద్రవము దాని నెదుర్కొనే విధానము" అనే కరపత్రంలో లెనిన్ ఇలా వ్రాశాడు:

"చరిత్రయొక్క గతితర్కం అటువంటిది. యుద్ధంమూలంగా గుత్తపెట్టుబడి విధానం ప్రభుత్వపు గుత్తపెట్టుబడి విధానంగా మార్పు చెందింది. ఈ మార్పు ఎంతో త్వరగా జరిగింది. తద్వారా మానవసమాజం సోషలిజంవైపుకు ఎంతో త్వరగా పురోగమించింది.

సామ్రాజ్యవాదయుద్ధం సోషలిస్టు విప్లవానికి ప్రభాతం. యీ పరిస్థితికి కారణం, యుద్ధంలోజరిగే ఘోరాలు కార్మికవర్గాన్ని తిరగబడేటట్లు చేయడం ఒకటే కాదు. పెట్టుబడిదారీ విధానం ప్రభుత్వ గుత్తపెట్టుబడి పద్ధతిలోకి రావడం అంటేనే సోషలిజానికి అనుకూలమైన పరిస్థితులు ఏర్పడ్డాయన్నమాట. ఇది సోషలిజానికి నాంది. అట్టి పరిస్థితులు పరిపక్వం చెందకుండా ఏ తిరుగుబాటూకూడా సోషలిజాన్ని తీసుకురాజాలదు. పైనచెప్పిన పరిస్థితి చరిత్ర అనే నిచ్చెనలో సోషలిజానికి క్రిందిమెట్టు. దీనితరువాత సోషలిజమే. ఈ రెంటికి మధ్య ఇంకోమెట్టు లేదు."

లెనిన్ ఇంకా ఇలా వ్రాశాడు:

"జంకరు పెట్టుబడిదారీ ప్రభుత్వ స్థానంలో విప్లవాత్మక ప్రజాతంత్ర ప్రభుత్వమైన భూస్వామ్య పెట్టుబడిదారీ ప్రభుత్వం నెలకొల్పబడిందనుకోండి. అంటే, ఒక విప్లవ మార్గంలో అన్ని ప్రత్యేక సదుపాయాలను నిర్మూలించి, పూర్తి ప్రజాతంత్ర విధానాన్ని అమలుజరపడానికి జంకని ప్రభుత్వం వచ్చిందనుకోండి. అప్పుడు మీకొకవిషయం తేటతెల్లమవుతుంది. విప్లవాత్మక ప్రజాతంత్ర ప్రభుత్వంలో ప్రభుత్వ గుత్తపెట్టుబడి పద్ధతి వస్తే అది తప్పనిసరిగా సోషలిజంవైపుకు నడవడమేనన్నమాట."

అదే కరపత్రంలో లెనిన్ మరొక విషయాన్నికూడా స్పష్టంచేశాడు. ప్రభుత్వపు

గుత్తపెట్టుబడిదారీ విధానం ఒక నిరంకుశ, అభివృద్ధి నిరోధక ప్రభుత్వంచేతిలో వుండి, ప్రజలను దోచుకోడంకోసం వినియోగింపబడేకంటే, కార్మిక సోవియట్ల పెత్తనంక్రింద ఒక విప్లవ మార్గంలో నడపబడితే అది సోషలిజం కాకపోయినా, పెట్టుబడిదారీ విధానంమాత్రం కాదు.

లెనిన్ ఇంకో సంగతికూడా నొక్కి చెప్పాడు. బ్యాంకులు, బొగ్గు, ఇనుము, ఉక్కు, పంచదార మొదలైన పారిశ్రామిక సిండికేట్లు, జాతీయం చేయడంవల్ల ఒక్క దెబ్బలో ఒకదానికొకటి బాగా పెనవేసుకుని వున్న ఆ సంస్థలే కాకుండా వాటితోపాటు మధ్యరకపు బ్రోకర్లు సాగించే దగాకోరు దళారీ వ్యాపారాలుకూడా ఎగురుతాయి. "ఉన్నతస్థానాల"నాక్రమించిన యీ పరిశ్రమలు ఫైనాన్సు కనక కార్మికుల చేతుల లోను, కార్మిక కర్షక ప్రజాతంత్ర ప్రభుత్వం చేతులలోనువుంటే, పెట్టుబడిదారులంతా మన గుప్పెట్లో వుంటారన్నమాట. దోపిడి దార్లను దోచుకోవడమనే కర్తవ్యం చక్కని ఆచరణ సాధ్యమైందిగాను, తేలికైనదిగాను అవుతుంది. ఎందుచేతనంటే, చిన్నాపెద్దా అందరు పెట్టుబడిదారులయొక్క యుద్ధం వల్ల లాభాలు గుంజినవారియొక్క గుట్టు మట్టులన్నీ కార్మికులకు బాగా తెలుస్తాయి.

1917 జులైలో బోల్షివిక్ పార్టీ 6 వ కాంగ్రెస్ సమావేశంవరకూ కార్యక్రమాన్ని మరో అడుగుముందుకు తీసుకుపోలేదు. అప్పుడు పార్టీ సాయుధ తిరుగుబాటుకు సన్నద్ధమవుతోంది.

6 వ కాంగ్రెస్‌ను గురించి సో॥ యూ॥ కమ్యూనిస్టుపార్టీ చరిత్రలో స్టాలిన్ ఇలా వ్రాశారు:

"కాంగ్రెస్, బోల్షివిక్కుల ఆర్థిక కార్యక్రమాన్ని వినాదాలనుగురించి చర్చించి ఆమోదించింది. ఆ కార్యక్రమంలో ముఖ్య విషయాలు, జమీందారీలను వశపర్చుకోడం. భూమిని, బ్యాంకులను, భారీపరిశ్రమలను, జాతీయంచేసి, సరకుల ఉత్పత్తిమీద, పంపకం మీద కార్మికుల పెత్తనాన్ని నెలకొల్పడం"

1917 "అధికారాన్ని హస్తగతం చేసుకోవాలి" అనే పుస్తకంలో పార్టీ కార్యక్రమంలో మార్పు అనే శీర్షికక్రింద లెనిన్ ఇలా వ్రాశాడు :

"మనపార్టీ రాజకీయాధికారాన్ని చేబట్టడంకోసం మనమిప్పుడు పోరాడుతున్నాం. యీ అధికారం అనేది కార్మికుల పేదరైతుల నియంతృత్వంగా వుంటుంది. ఈ అధికారాన్ని చేబట్టడంలో మనం, బూర్జువావిధానపు హద్దులను దాటి ముందుకు పోవడానికి ఏమాత్రం భయపడం. అంతేకాదు. మనం ఆ హద్దులనుదాటి నిర్భయంగా సోషలిజం వైపు నడుస్తామని స్పష్టంగాను, నిస్సంకోచంగాను, బహిరంగంగాను ప్రకటిస్తాం. దానికి మార్గం సోవియట్ రిపబ్లిక్‌ను స్థాపించడం. బ్యాంకులు, పారిశ్రామిక సిండికేట్లు జాతీయంచేసి కార్మికుల పెత్తనంక్రింద పనిచేయించడం. భూమినికూడ జాతీయం చేయడం. భూస్వాముల చేతిలోవున్న పశుసంపదను, వ్యవసాయిక పనిముట్లను వశపర్చుకోవడం. ఈ విధంగా సోషలిజంలోకి పరిణామం చెందడానికి అనువుగా మన కార్యక్రమాన్ని తయారుచేశాం."

ప్రజాచైతన్యంలో రోజురోజుకి మార్పులు సంభవిస్తూన్న ఆ చారిత్రక ఘడియల్లో బోల్షివిక్ పార్టీ అవలంబించిన కార్యవిధానాన్ని పరిశీలిస్తే, పరిస్థితులలోని గతితర్కశాస్త్రాన్ని వారు ఎంత అద్భుతంగా గ్రాహ్యం చేసుకున్నారో, దానిలో ఎంత పాండిత్యం సంపాదించారో మనకి అర్థం అవుతుంది. ఆ కార్యక్రమంలో మొదటినుంచి చివరిదాకా ఖచ్చిత

పైన పెట్టుబడిదారీవిధాన వ్యతిరేకత ద్యోతకమవుతూ నేవుంది. అప్పుడు లేవదీసిన కోర్కెలన్నీ పెట్టుబడిదారీ విధానపు హద్దులలోనే వున్నాయని, బూర్జువావర్గాన్ని పూర్తిగా తుడిచిపెట్టాలని కోరడంలేదని ఒకపక్క చెబుతూనే, లెనిన్, బూర్జువావర్గం అడుగడుగునా విధ్వంసకచర్యలకు లేపడుతూనే వుంటుందని పదేపదే హెచ్చరిస్తూనే వుండేవాడు. పెట్టుబడియే పరమదైవమని ఆరాధించడం అంతమొందితేనేతప్ప ఏమీ సాధించలేమని స్పష్టంచేసేవాడు. కార్మికుల పెత్తనాన్ని అంగీకరించకపోయినా, విధ్వంసక చర్యలకు దిగినా శిక్షిస్తామని వ్యక్తిగతఆస్తిని స్వాధీనం చేసుకుంటామని పెట్టుబడిదారులను బెదిరించకపోతే లాభంలేదని చెప్పేవాడు.

రష్యాలో అసంఖ్యాకులైన మధ్యతరగతి ప్రజలు, ముఖ్యంగా రైతులు, ఒకపక్క స్వంత ఆస్తిపట్ల తమకున్న మమకారం మరోపక్క యుద్ధంమూలంగాను, ఆర్థిక సంక్షోభాలవల్ల, అధికలాభపరుల చేతులలోపడి నలిగిపోవడంవల్ల బూర్జువా వ్యతిరేకభావాలకు మధ్యపడి కొట్టుకులాడేవారు. అందుచేత బోల్షివిక్కులు, ఉద్యమాన్ని ఒక్కొక్క మెట్టే పైకి నడుపుతూవచ్చారు. ప్రజలలోవుండే పెట్టుబడిదారీ వ్యతిరేక చైతన్యస్థాయిని మించి బోల్షివిక్ పార్టీ పెట్టే కోర్కెలు వుండేవి కావు. అన్నీ ప్రభుత్వపరంగావాలనే సామాన్య కోర్కెలకుకూడా బూర్జువావర్గం ఎదురుతిరిగేది. ఈచర్యలను ఎప్పటికప్పుడు నిర్దయాత్మకంగా బహిరంగపరుస్తూ వుండడం వల్లనే బ్యాంకులు, భారీపరిశ్రమలు వగైరా జాతీయంచేయాలనే నినాదం, అక్టోబరు విప్లవానికిముందు ఇవ్వడానికి తగిన పరిస్థితులు ఏర్పడ్డాయి.

## IV

అదేవిధంగా భారతదేశంలోకూడా కీలక పరిశ్రమలను జాతీయంచేయాలనిగాని వాటిలో పెట్టిన పెట్టుబడులను స్వాధీనంచేసుకోవాలనిగాని నినాదం ఇవ్వకూడదని వాదించేవారు రష్యన్ విప్లవం నేర్పేగుణపాఠాన్ని మరచిపోతున్నారు.

1905 నుండి 1917 వరకూ గాని, 1917 లో గాని బోల్షివిక్కులు ఇస్తూవచ్చిన నినాదాలు ఆయా దశలలో రష్యన్ పెట్టుబడిదారీ విధానంలో వచ్చిన చారిత్రక మార్పులకు సరిగా సరిపోయేటట్లే వున్నాయనేది మరచిపోతున్నారు. 1905 కి పూర్వమూ, ఆ తరువాత 1917 ఫిబ్రవరి మధ్యకాలంలో రష్యన్ పెట్టుబడిదారీ విధానపుపాత్ర మారుతూ వచ్చింది. స్వేచ్ఛాపోటీదశనుంచి గుత్త పెట్టుబడి దశలోకి మారింది. మొదటి సామ్రాజ్యవాద యుద్ధకాలంలో ప్రభుత్వపు గుత్త పెట్టుబడి పద్ధతిలోకి మారాలనే ధోరణులు వచ్చాయి. 1917 ఫిబ్రవరి, అక్టోబరు నెలల మధ్యకాలంలో మధ్యతరగతి ప్రజాసామాన్యంలో పెట్టుబడిదారీ వ్యతిరేక చైతన్యం ఎక్కువఅయింది. ఈ మార్పుల కన్నిటికి అనుగుణ్యంగానే బోల్షివిక్కులు తమ నినాదాలను ఇస్తూ వచ్చారు.

ఈగుణపాఠాన్ని నేర్చుకుంటే 1928 లో 6వ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ యీ దిగువ కార్యక్రమాన్ని ఎందుకు ఇచ్చిందోకూడ బోధపడుతుంది.

"విజయం పొందిన కార్మికవర్గం తనచేతికి వచ్చిన అధికారాన్ని, ఆర్థిక విప్లవానికి సాధనంగా వినియోగిస్తుంది. అంటే పెట్టుబడిదారీవిధానపు ఆస్తి సంబంధాలను సోషలిస్టు పద్ధతి ఉత్పత్తిసంబంధాలుగా మార్చడానికి వినియోగిస్తుంది. ఈ మహత్తరమైన యీ ఆర్థిక

విప్లవానికి ప్రారంభం పెట్టుబడిదారులను, భూస్వాములను పూర్తిగా లేకుండా చేయడం అంటే బూర్జువా వర్గానికి గుత్త ఆస్తిగా వున్న దానిని కార్మికవర్గ ప్రభుత్వంయొక్క ఆస్తిగా మార్చడం.

"ఈ సందర్భంలో కమ్యూనిస్టు ఇంటర్నేషనలు, కార్మిక వర్గనియంతృత్వ ప్రభుత్వానికి యీ క్రిందికార్యక్రమాన్నిస్తుంది."

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ యిచ్చిన కార్యక్రమాన్ని యీవిధంగా క్లుప్తీకరించవచ్చు.

1. వ్యక్తిగత ఆస్తులుగావున్న అన్ని పెద్ద పరిశ్రమలను (ఫ్యాక్టరీలు, గనులు, విద్యుచ్ఛక్తి కేంద్రాలు, రవాణాలు వగైరా) స్వాధీనం చేసుకుని కార్మికవర్గ పెత్తనంక్రింద జాతీయం చేయడం, ప్రభుత్వసంస్థలను, మున్సిపల్ సంస్థలను సోవియట్లుగా మార్చడం.

2 పరిశ్రమలు కార్మికుల మేనేజిమెంటు క్రింద పనిచేసేటట్లు ఆర్గనైజుచేయడం. ట్రేడ్ యూనియన్ల సన్నిహిత సహకారంతో పరిశ్రమలను నడపడానికి ప్రభుత్వ కమిటీలను ఏర్పరచడం.

ఈ కార్యక్రమమంతా మొట్టమొదటి సోషలిస్టు విప్లవమైన రష్యన్ అక్టోబరు (1917) విప్లవానుభవాన్ని పూర్తిగా అవగాహన చేసుకున్న మీదటనే ఇవ్వబడింది.

ఈ కార్యక్రమాన్ని నిర్ణయించడంలో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ యీ దిగువ విషయాలను దృష్టిలోపెట్టుకుంది. మొదటి ప్రపంచయుద్ధం వల్లను, దానితరువాత వచ్చిన ఆర్థిక సంక్షోభంవల్లను పెట్టుబడిదారీ విధానంలోని దివాలాకోరుతనం బాగా బైటపడింది. తత్ఫలితంగా శ్రామిక జనసామాన్యంలో వర్గచైతన్యం ఎంతో పదునువారింది. సోషల్ డెమాక్రాటిక్ ప్రభుత్వాలు, ఫాసిస్టు ప్రభుత్వాలు పరిశ్రమలు వగైరాలను జాతీయం చేస్తున్నామని ఆడే కపటనాటకాలన్నీ గుత్త పెట్టుబడులు మరింత స్వేచ్ఛాదోపిడిని సాగించడానికేనని శ్రామికులు గ్రహించారు. చారిత్రాత్మకమైన యీ పరిస్థితుల నన్నిటిని దృష్టిలో పెట్టుకునే, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ అక్టోబరు విప్లవానికి పూర్వం కంటే మరింత స్పష్టమైన కార్యక్రమాన్ని ఇవ్వగలిగింది.

వలసదేశాల విప్లవాలను గురించికూడా, ఇదేవిధంగా 1905 లో బోల్షివిక్‌ల కార్యక్రమం వరకే గుడ్డిగా హద్దులు పెట్టుకొని కూర్చోలేదు. అలాంటి ప్రయత్నాలను వ్యతిరేకించింది కూడ.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ తయారుచేసిన కలోనియల్ థీసిస్ (వలసదేశాలను గురించిన థీసిస్)లో, వలసదేశాలలో వచ్చే జాతీయ ప్రజాతంత్ర విప్లవాలు త్వరితంగా సోషలిస్టు విప్లవాలుగా మారతాయి అనే విషయాన్ని స్పష్టీకరించింది. అంతేకాదు. మరో విషయాన్నికూడ ప్రత్యేకంగా వివరించింది. వలసదేశాలలో పెట్టుబడిదారీ విధానం పెత్తనంవహించే దశకాని, పెట్టుబడిదారీ సంబంధాలు అభివృద్ధిచెందే దశగాని రాకుండానే ఇది సాధ్యమవడానికి అవకాశంవుంది. ఈ దృక్పథం తీసుకోడానికి రెండు కారణాలు. ఒకటి : పెట్టుబడిదారీవిధానంలో సంక్షోభం అతితీవ్రరూపందాల్చి వుండడం. రెండవది : వలసదేశ విప్లవాలకు సోవియట్ యూనియనూ, ఇతరదేశాలలోని కార్మికవర్గ నియంతృత్వమున్న ప్రభుత్వాలు చేసే సహాయం.

అందుచేతనే కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ తన కార్యక్రమంలో ప్రత్యేకంగా "8 గంటల పనే వుండాలి" అని, "సామ్రాజ్యవాదులకు చెందిన భారీ పరిశ్రమలను (పారిశ్రామిక, రవాణా, బ్యాంకి మొదలైనవాటిని) జాతీయం

"చేయాలి" అని నినాదాలు ఇవ్వడమే గాకుండా యీ క్రిందివిధంగాకూడా చెప్పింది.

"వలసదేశాల్లోను, అర్ధవలసదేశాల్లోను వచ్చే పోరాటాల్లో ఎక్కడైతే కార్మికవర్గం నాయకత్వం వహించి నడుపుతుందో అక్కడ బూర్జువా ప్రజాతంత్ర విప్లవం, కార్మిక విప్లవంగా పెంపొందుతుంది. ఈ మార్పు రావడం పోరాటంయొక్క అభివృద్ధిని తీవ్రతనుబట్టి వుంటుంది. (బూర్జువావర్గంచేసే విధ్వంసక చర్యలు, అలాచేసే వారికి చెందిన సంస్థలను స్వాధీనంచేసుకోడం క్రమంగా అది భారీ పరిశ్రమల నన్నింటినీ జాతీయం చేసేవరకుకూడ వ్యాపిస్తుంది)".

## V

1928 లో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ పైన చెప్పినట్లుగా ప్రజాతంత్ర విప్లవం కార్మిక విప్లవంగా పెంపొందుతుందని భారీపరిశ్రమల నన్నింటినీ జాతీయం చేయాలని దృక్పథం తీసుకున్నప్పటికీ తన కార్యక్రమంలో అలాంటి కోర్కెలను పెట్టజాలకపోయింది. ఎందుచేతనంటే అప్పుడు జాతీయ బూర్జువా వర్గాలు ఇంకా సామ్రాజ్యవ్యతిరేక పాత్రను వహించి వున్నాయి. వలసదేశ పరిశ్రమలలో సామ్రాజ్యవాద గుత్తవ్యాపారుల పెత్తనమే ఎక్కువగా వుంది.

కాని 1928 లో వున్న వర్గసంబంధాలు నేడు భారతదేశంలో లేవు. నేడు ఇండియాలో ఒక ప్రధానమైన మార్పువచ్చింది. ప్రజాతంత్ర విప్లవం కార్మికవర్గ విప్లవంగా మారడం అనేదాన్ని ఒక కొత్త దృక్పథంతో అర్థం చేసుకోవలసివుంది.

భారత కమ్యూనిస్టు పార్టీ రాజకీయ థీసిస్‌లో ఇలావుంది:

"నేడు మనదేశంలో వివిధశక్తుల మధ్య వున్న పరస్పర సంబంధాలను పరిశీలిస్తే ప్రజాపోరాటం ముందుకువేసే ప్రతి అడుగు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా మాత్రమే గాకుండా, బూర్జువా వర్గానికికూడా వ్యతిరేక చర్య అయివుంటుంది. దీనినిబట్టి పూర్వం అనుకునే బూర్జువా ప్రజాతంత్ర విప్లవం అనే దశ దాటిపోయిందని స్పష్టమవుతుంది. అంటే జాతీయ బూర్జువావర్గం సామ్రాజ్యవాద వ్యతిరేక కూటమిలో వుండే దశ పోయింది. నేడు జరిగే సంఘటనలధోరణి అంతా చూస్తే కార్మిక కర్షకుల, అణచిపెట్టబడిన మధ్యతరగతి ప్రజల ప్రజాతంత్ర ప్రభుత్వం కావాలి అనేదే సరియైన నినాదం. సామ్రాజ్యవాదాన్ని దాని మిత్రులైన జాతీయ బూర్జువావర్గాన్ని ఓడించి ప్రజాసామాన్యానికి విముక్తి కలిగించాలంటే వారిని సమీకరించడానికి నేడు ఇదొక్కటే నినాదం. అంటే దానిఅర్థం ప్రజాతంత్ర విప్లవంయొక్క కర్తవ్యాన్ని పరిపూర్తి చేయడానికి, అదే సమయంలో సోషలిజాన్ని నిర్మించడానికి ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవాన్ని తీసుకురావాలి. ఇది నెరవేరాలంటే మనదేశంలో వుండే శ్రామిక జనసామాన్యాని కంతటికీ దిట్టమైన కార్మికవర్గ నాయకత్వం నెలకొల్పబడాలి."

నేడు మన దేశంలో వున్న వర్గసంబంధాలు ఆవిధంగా వున్నాయి. సామ్రాజ్యవాదులకు, భారత పెట్టుబడిదారులకు ఆర్థికంగా కలయిక ఏర్పడింది. ఇరువురూ భాగస్వాములయ్యారు. ఈ ఆర్థిక ఐక్యత వారిరువురిమధ్య రాజకీయ కలయికకు ప్రాతిపదికను నిర్మిస్తుంది. ప్రజాసామాన్యం యుద్ధంరోజుల్లోను, యుద్ధానంతర కాలంలోను పడిన, పడుతున్న బాధలు వారిలో పెట్టుబడిదారీ వ్యతిరేక చైతన్యాన్ని రేకెత్తించుతోంది. "దొంగ

వ్యాపారస్థులను ఉరిదీయాలి", "కీలక పరిశ్రమలను జాతీయంచేయాలి" అనేవి ప్రజాసామాన్యంలో ఎంతో హర్షించే నినాదాలుగా వున్నాయి. అందుచేత ఈ పరిస్థితులలో ప్రజాస్వామిక ప్రజాతంత్ర ప్రభుత్వంచే, అన్ని కీలక, భారీ పరిశ్రమలు వశపర్చుకోబడి జాతీయం చేయబడాలనే నినాదం సంభవమే గాకుండా తప్పనిసరికూడా.

అందుచేత "ప్రజాతంత్ర విప్లవ కార్యక్రమం"లో 11వ క్లాజుకి అర్థం, కార్మికవర్గ పెత్తనంక్రింద జాతీయంచేయడం అని. అంటే అన్ని కీలక భారీ పరిశ్రమలూకూడా ప్రజాస్వామిక ప్రజాతంత్ర ప్రభుత్వం వశపర్చుకొని కార్మికుల కమిటీలద్వారా నడపబడాలి.

అలా కాకుండా "జాతీయంచేయడ"మంటే పూర్తిగా వశపర్చుకోడం కాదనీ, దాని అర్థం ప్రభుత్వం గుత్తపెట్టుబడి పద్ధతిని అమలుజరిపి గుత్తవ్యాపారుల లాభాలను అలాగే వుంచడం అనిగాని లేదా అది నష్టపరిహారం ఇవ్వడానికి అవకాశాన్ని అట్టేపెట్టిందనిగానీ అనుకోవడమంటే, బ్రిటిష్ లేబరుపార్టీ చేసిన మాదిరి బూర్జువావర్గపెత్తనం క్రింద జాతీయంచేయడం అని భావించడమే ఆ వ్యాఖ్యానం. ఆ క్లాజుయొక్క అర్థానికి పూర్తిగా వ్యతిరేకం కమ్యూనిస్టు ఇంటర్నేషనలు ఇచ్చిన నినాదాన్ని తల్లకిందులు చేయడం అవుతుంది. ఆ విధంగా అర్థంచేసుకోడం అసలు మన రాజకీయ థీసిస్‌లోవున్న సిద్ధాంతీకరణకే పూర్తి విరుద్ధం.

ఈ విధంగా మన కార్యక్రమాలకీ, చెప్పిన మాటలకు సంస్కరణతత్వపు అర్థాలను అంటగట్టేవారికి, బోల్షివిక్‌ల కార్యక్రమాల్లోగాని, లెనిన్ రచనలలోనిగాని ఎక్కడా సమర్థించుకునే ఆస్కారం దొరకదు. లెనిన్ రచనలను గుడ్డిగా అర్థంచేసుకుని తప్పుడువ్యాఖ్యానాలు చేయడంవల్ల తప్పుడు ఉదాహరణలు ఇవ్వడం వల్ల వారు సాధించేదిసున్న. పెట్టుబడిదారులతో రాజీని సమర్థించుకోడానికి లెనిన్ చెప్పిన మాటలను ఉదహరించడం అంటే, పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందే దశకోసం అర్రులు సాచడం అన్నమాట. అది మార్క్సిజానికి వక్రస్వరూపం. లెనినిజంపై తిరుగుబాటు సహించరాని చర్య.

"స్వాతంత్ర్యం అనే శబ్దం చాలాగంభీరమైనది. అయితేనేం? వర్తక స్వాతంత్ర్యం పేరుతో భయంకరమైన యుద్ధాలెన్నో జరిగాయి. కార్మిక స్వాతంత్ర్యం పేరుతో కార్మికుల శ్రమశక్తిని పెట్టుబడిదారులంతా దోచుకుంటున్నారు."

— లెనిన్

("ఏమిచెయ్యాలి" 14 వ పేజీ)

# సోవియట్ ☆ విదేశాంగ విధానంపై కామ్రేడ్ లెనిన్ ::

—వై. ప్రాక్టిసిక్

ప్రపంచ చరిత్రలో నూతనాధ్యాయాన్ని ప్రారంభించిన నవంబరు సోషలిస్టు మహా విప్లవం అంతర్జాతీయ సంబంధాల విధానం మొత్తంలోనే ఒక మహత్తరమైన మార్పును తీసుకొనివచ్చింది. ప్రపంచంలో మొట్ట మొదటిసారిగా ఒక సోవియట్ సోషలిస్టు రాజ్యం అవతరించింది. పెట్టుబడిదారీ రాజ్యాలవలెగాక సోవియట్ రాజ్యం తన సహజ ప్రవృత్తి ననుసరించి దురాక్రమణ దురాశలకు పూర్తిగా వ్యతిరేకం. వివిధ దేశాలమధ్య న్యాయం, శాంతి, మిత్రత్వమూ నెలకొల్పడం దాని పరమాశయంగా ఎంచుకొంటుంది.

లెనిన్, స్టాలిన్‌ల అధ్వర్యం గల సోవియట్ విదేశాంగ విధానం పరిపూర్తిగా నూతనసూత్రాలపై ఆధారపడి వుంది. శాశ్వత ప్రజాతంత్ర శాంతికోసం వివిధ దేశాల భద్రతకోసం ఎలాంటి వూగిసలాట లేకుండా పోరాడటం, యుద్ధోన్మాదులను బట్టబయలు చేయడం, పెద్దా, చిన్నా అనే తారతమ్యం లేకుండా అన్నిదేశాల ప్రజల స్వేచ్ఛనూ, సర్వస్వాతంత్ర్యాన్ని, సమానత్వాన్ని రక్షించడం, సామ్రాజ్యవాద ఖూనీకోరులనుండి ఆ దేశాల స్వాతంత్ర్యాన్ని, వాటి హక్కులనూ, ప్రయోజనాలనూ కాపాడటం — ఇవీ సోవియట్ విదేశాంగ విధానంయొక్క ప్రత్యేక లక్షణాలు.

1917 నవంబరు 8 వ తేదీన సోవియట్ల కాంగ్రెసులో శాంతినిగురించి శాసనాన్ని ప్రతిపాదించుతూ లెనిన్ యిలా చెప్పాడు:

"జయించబడిన బలహీనదేశాలను బలవత్తరమైన పెద్దరాజ్యాలమధ్య పంచుకొనేఉద్దేశ్యంతో జరుగుతున్న యుద్ధాన్ని యింకా కొనసాగించడం మానవజాతికి వ్యతిరేకంగాజరిపే ఘోరమైన ద్రోహంగా మన ప్రభుత్వం తలంచుతోంది. అందువలన ఎలాంటి మినహాయింపులు లేకుండా అన్ని దేశాలవారికీ సమానంగా, న్యాయసమ్మతంగా వుండే శాంతిపరతుల సంధిపత్రంపై వెనువెంటనే సంతకం పెట్టేందుకు ప్రభుత్వం తన ధృడనిశ్చయాన్ని ప్రకటించుతోంది."

అప్పటినుండి దాదాపు ముప్పది సంవత్సరాలకుపైగా ప్రజాతంత్ర యుతమగు శాంతికోసం సోవియట్ రాజ్యం, సోవియట్ ప్రభుత్వమూ, సాగిస్తున్న పోరాటం అంతర్జాతీయ వ్యవహారాల చరిత్రలోనే ఒక క్రాంతి రేఖగా ఉండిపోయింది.

సోషలిస్టు దేశం పెట్టుబడిదారీ దేశాల ప్రక్కన మనగలగడం సహజమనీ, యీ ఈ పరిస్థితినే చరిత్రలో చాలకాలం వరకు కొనసాగించ వచ్చుననే భావంపైననే సోవియట్ రాజ్యంయొక్క విదేశాంగ విధానం ఆధారపడి ఉంది. 1947లో లెనిన్ యొక్క సన్నిహిత సహచరుడూ, ఆయనచేసిన మహత్తర కృషిని కొనసాగిస్తున్న వ్యక్తి అయిన కామ్రేడ్ స్టాలిన్ యిలా అన్నాడు.

"రెండు రాజ్యాంగవిధానాల మధ్య సహకారం వుండవచ్చుననేభావం మొట్టమొదట లెనిన్ చేత ప్రతిపాదించబడింది. లెనిన్ మనకు అధ్యాపకుడు. సోవియట్ ప్రజలమైన మనం లెనిన్ శిష్యులం. లెనిన్ నిర్దేశించిన ఆదేశాలనుండి మనం ఎన్నడూ తప్పలేదు; ఇకముందెన్నడూ తప్పబోము."

## సోవియట్ శాంతినే కోరుతున్నది

రెండు రాజకీయ విధానాలూ ఒకదాని ప్రక్క మరొకటి వుండడం అసాధ్యమని లెనిన్, స్టాలిన్‌లపార్టీ భావించుతున్నట్లుగా యిప్పుడు అమెరికా సామ్రాజ్యవాద ప్రచారకులు నొక్కి చెపుతున్నారు. ఈ సమస్యపై లెనిన్ యొక్క ప్రకటనలను సామ్రాజ్యవాద సిద్ధాంతకర్తలూ, ప్రచారకులూ కావాలని తప్పుడుగా చిత్రించుతున్నారు. అమెరికా సామ్రాజ్యవాదులు రేపుతున్న అంతర్జాతీయ సంఘర్షణలనూ, సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా వారు చేసే యుద్ధ సన్నాహాలనూ సమర్థించుకొనేందుకే వారీవిధంగా చేస్తున్నారనేవిషయం తెలుసుకోవడం కష్టం కాదు.

1919 డిసెంబరులో అంతర్జాతీయ పరిస్థితులపై లెనిన్ చే తయారుచేయబడి, అఖిల రష్యాపార్టీ మహాసభలోనూ, ఏడో సోవియట్ల కాంగ్రెసులోనూ ఆమోదించబడిన తీర్మానంలో యీ క్రిందివిధంగా ఉంది:

"రష్యన్ సోషలిస్టు ఫెడరేటివ్ సోవియట్ రిపబ్లిక్ అన్ని దేశాలతోనూ శాంతియుతంగా జీవించాలని అభిలషిస్తోంది. ఇది వరకు 'హంగర్ బ్లాకేడ్' వల్ల యింకా యితరములవల్లా సాధ్యపడని – ఉత్పత్తిని సంఘటితపరచుకోవడం, రవాణాసౌకర్యాలను అభివృద్ధిపరచుకోవడం, సోవియట్ వ్యవస్థ పరిపాలనా విధా

నాన్ని పదిలపరచుకోవడం మొదలుగాగల ఆంతరంగిక అభివృద్ధికి సంబంధించిన ప్రయత్నాలపై తన కృషిని కేంద్రీకరింప దలచుకొన్నది.”

1920 నవంబరులో సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా జరిగిన మూడో బహిష్కరణదాడి విఫలమైనప్పుడు లెనిన్ దీనిని సోవియట్ రాజ్యంయొక్క మహత్తర విజయంక్రింద పరిగణించాడు.

“... పెట్టుబడిదారీ ప్రభుత్వాలతోపాటు వారిప్రక్కనే వుండగలిగే పరిస్థితులను మనం సాధించగలిగాం. పెట్టుబడిదారీ దేశాలు తప్పనిసరిగా మనతో వాణిజ్య సంబంధాలను పెట్టుకోవలసి వచ్చింది. ఈ పోరాటపరిణామంలో స్వతంత్రంగా ఉండేందుకు గల హక్కును మనం సాధించుకోగలిగాం...

“పెట్టుబడిదారీ రాజ్యాలతోబాటు మనంకూడా అంతర్జాతీయంగా వుండగల హక్కును ప్రధానంగా సాధించి మనమిప్పుడొక నూతనదశలో ప్రవేశించ గలిగాం.”

అప్పటినుండీ లెనిన్ స్టాలిన్‌ల సారథ్యం క్రింద అనుసరించబడిన సోవియట్ ప్రభుత్వ విదేశాంగ విధానంలో ఇతరదేశాలతో సహకరించాలనే సోవియట్ ప్రజల వాంఛ లెక్కలేనన్నిసార్లు ప్రదర్శితమైంది. అయితే యీ సహకారం సమానహోదాపైనేగాని సామ్రాజ్యవాద ప్రభుత్వాల చెప్పుచేతల్లో ఎంత మాత్రమూ కాదు.

1922 వసంతఋతువులో జినీవాలో బ్రిటిష్ ఫ్రెంచి సామ్రాజ్యవాదులు తమకు లాభదాయకమైన ఆర్థిక సంబంధాలను సోవియట్ రిపబ్లిక్‌పై యుద్ధానికి చేసే ప్రయత్నాలను గురించి లెనిన్ మాట్లాడుతూ సోవియట్ ప్రజలను ఆ విధంగా బెదిరించి చేయించుకోవాలనుకోవడం వృథా వెర్రితనమన్నాడు. లెనిన్ యిలా అన్నాడు:

“దాదాపు యావత్తు ప్రపంచాన్ని తమ గుప్పెటలో వుంచుకొన్న మిత్రరాజ్యాలు (ఇంగ్లండు ఫ్రాన్సు, అమెరికాలు_ అనువాదకుడు) తమ తుపాకుల బలంతో చేసిన బెదిరింపులను మేమెరుగుదుము. ఈ యూరప్ రాజకీయవేత్తల బెదిరింపులకు మేమేమాత్రం భయపడం. అది వారు మరచిపోకుండా వుండటం చాల క్షేమం.”

ప్రపంచాధిపత్యానికి అర్రులు చాస్తున్న అమెరికా దురాక్రమణదారులూ, పశ్చిమ యూరప్ దేశాలలోని వారి ఏజంట్లూ సోవియట్ యూనియన్‌ను బెదిరింపులతో జడిపించి లొంగదియాలని ప్రయత్నించే యీరోజులకుకూడా పాతిక సంవత్సరాల క్రింపట లెనిన్ ప్రవచించిన పైమాటలు చక్కగా సరిపోతాయి.

అలాంటి ప్రయత్నాలు 27 సంవత్సరాల క్రితమే సోవియట్ రిపబ్లిక్ యింకా బలహీనస్థితిలో ఉన్నప్పుడే విఫలమయ్యాయి. అలాంటప్పుడు యీనాడు లెనిన్ స్టాలిన్ల సరియైనపంథానుఅనుసరించడం మూలంగా సోవియట్ యూనియన్ బలవత్తరమైన సోషలిస్టు రాజ్యంగా పరిమితిచెంది, జర్మన్ సామ్రాజ్యవాద బందిపోటులను సర్వనాశంచేసి, ఫాసిస్టు పశుత్వాన్నుండి నాగరికతను రక్షింపగలిగిన

యీసాను వారి ప్రయత్నాలు ఫలించే అవకాశాలు ఏమాత్రమూ లేవు.

అంతర్జాతీయ వ్యవహారాలలో ప్రతిజాతియొక్క ప్రయోజనాలనూ, సర్వస్వతంత్రాన్నీ గౌరవించాల్సిన అవసరాన్ని గురించి లెనిన్ ప్రత్యేకంగా నొక్కి చెప్పాడు. ఉదాహరణగా బోల్షివిక్ పార్టీ సోవియట్ ప్రభుత్వమూ అనుసరించిన జాతీయపంథా, సాధించిన విజయాలనుగురించి తెలియజేయాడు:

"వివిధ దేశాల ప్రయోజనాల యెడల సంపూర్ణమైన దృష్టిని కేంద్రీకరించితేనే - వివిధ దేశాల మధ్య సంఘర్షణలకు గల అవకాశాలూ, పరస్పరంగా వుండే అవిశ్వాసాలూ, ఒకరిపై మరొకరు కుట్రలు పన్నుతారనే భయాలూ నివారణకాగల వని మన అనుభవం మనకు దృఢమైన నమ్మకాన్ని కలుగజేసింది. అలాంటప్పుడే ముఖ్యంగా వివిధభాషలను మాట్లాడే కార్మిక కర్షకుల మధ్య పరస్పర విశ్వాసం అభివృద్ధి చెందుతుంది. అలాంటి పరస్పర విశ్వాసం లేనిదే వివిధ జాతుల మధ్య శాంతియుతమైన సంబంధాలూ, లేక ఆధునిక నాగరికతలో విలువగల వాటిని శక్తివంతంగా అభివృద్ధి చేయడంగాని ఎంతమాత్రమూ సాధ్యపడదు."

నాగరికతను పెంపొందింపజేయడానికి సరిగా అవసరమైన యీ ముఖ్యసూత్రాన్నీ సామ్రాజ్యవాద అభివృద్ధి నిరోధక ముఠా ఒక నియమిత పద్ధతిలో అతిసాగరుబోతుదనంగా అతిక్రమించడం జరుగుతోంది. సామ్రాజ్యవాదంయొక్క సిద్ధాంతకర్తలూ ప్రచారకులూ జాతీయ సర్వస్వతంత్రాన్ని వెంటనే త్యజించదగిన ఒక "పాతబడిన దృక్పథంగా" ప్రకటించుతున్నారు.

## అన్ని జాతులయెడ గౌరవభావం

ప్రపంచాధిపత్యానికి సన్నాహపడుతున్న సామ్రాజ్యవాదులు జాతులయొక్క సర్వస్వతంత్రాన్ని నాశనంచేసి అతిక్రమించడమే తమ పరమాశయంగా పెట్టుకొన్నారు. ఈ విధంగా వారు విభేదజాతులమధ్య శాంతియుతమైన సంబంధాలు వుండేందుకుగల పునాదులనే ధ్వంసంచేస్తున్నారు.

గ్రీస్‌లో జోక్యం కలిగించుకోవడం, ఇండోనీషియా, వియత్‌నామ్‌ల ప్రజలపై దౌర్జన్యచర్యలు జరపడం, పశ్చిమ యూరప్ నంతటినీ మార్షల్ ప్లానుక్రిందకు తీసుకొని తమ బానిస సంకెళ్ళతో బంధించడం, యూరప్ రాజ్యాల అంతరంగిక వ్యవహారాలలో అసహ్యకరంగా జోక్యాన్ని కల్పించుకోవడం - యివన్నీ ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులముఠా జాతుల సర్వస్వతంత్రాన్ని అసభ్యంగా కాలదన్ని, వివిధజాతుల మధ్య అవిశ్వాసాలనూ, శత్రుత్వాలను రేకెత్తించే పాలసీని అనుసరించడంలో స్పష్టంగా ప్రదర్శిత మవుతున్నాయి.

సోవియట్ యూనియన్ అంతర్జాతీయ అభివృద్ధి నిరోధక ముఠా అనుసరిస్తున్న యీ పంథాను గట్టిగా వ్యతిరేకించుతుంది. అన్ని జాతులయొక్క స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు అండగా నిలచి వారి

వారి రాజకీయ, ఆర్థిక సాంస్కృతిక ప్రయోజనాలను గౌరవించాలని పట్టుబడుతుంది.

ప్రజాతంత్రయుతమైన శాంతి, వివిధ జాతులమధ్య స్నేహపూరితమైన సహకారమూ ఆశయంగాగల సోవియట్ విదేశాంగ విధానానికి పునాదులువేస్తూ లెనిన్ అనేకసార్లు ఇరవయ్యో శతాబ్దపు జర్మన్, బ్రిటిష్, ఫ్రెంచి అమెరికన్ సామ్రాజ్యవాదుల విదేశాంగ విధానంయొక్క నిజస్వరూపాన్ని గురించి చక్కగా వివరించాడు. వారిలో ఎవరికి ఏది ప్రత్యేకమో, వారందరికీగల సమాన ఆశయమేదోకూడా స్పష్టంగా తెలియజేశాడు. 1918 ఆగస్టులో అమెరికా కార్మికులకు వ్రాసిన జాబులో లెనిన్ యిలా వ్రాశాడు.

> "జర్మన్ బందిపోటు దొంగల మిలిటరీ క్రూరకృత్యాలు "ప్రసిద్ధి" చెందితే, ఇంగ్లీషువారు అనేకవలసదేశాలను యథేచ్ఛగా దోపిడీచేయడమేగాక తమ కపట యుక్తులతో అతినీచమైన వంచనలచేసిన "రికార్డు"ను సంపాదించుకొన్నారు."

అదేసంవత్సరం 1918 లో ఆంగ్లో-ఫ్రెంచి అమెరికన్ సామ్రాజ్యవాదాన్ని గురించి లెనిన్ వ్రాస్తూ "ప్రపంచచరిత్రే దానిని పరిపూర్ణంగా, నగ్నంగా, అతిస్పష్టంగా బట్టబయలు చేసింది" న్నాడు. అది ఒక "క్రూర జంతువుగా తయారయి ఫ్రెంచి అమెరికన్ "స్వతంత్ర" రిపబ్లిక సైన్యాలను చిన్నదేశాల బలహీన దేశాల స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను హరించడానికి వ్యపసంకంగానూ, ఖూనీకోరులుగానూ, గొంతుకలు కోసేవారిగాను వినియోగించింది."

సామ్రాజ్యవాదంయొక్క స్వభావాన్ని గురించి లెనిన్ యిచ్చిన వివరణను ఆ తరువాత కాలం ఉదాహరణలతో సహా ధృవపరచింది.

—అమెరికా, బ్రిటన్ ఫ్రాన్సుల సహాయ సంపత్తి కాదా జర్మన్ సామ్రాజ్యవాదులు తమ దేశంలో రాక్షస ఫాసిస్టుప్రభుత్వాన్ని స్థాపించేటట్లుచేసి, మిలిటరీ దారుణ హింసాకాండతో స్పెయిన్, జెకోస్లోవకియా, స్లావ్ ప్రజలను అణచగలిగింది?

—హిట్లర్ రెండో ప్రపంచయుద్ధాన్ని తెచ్చే సత్తాకలిగించింది - బంగారపు డాలర్లు, పౌన్ల ప్రభావంకాదా? ఈ యుద్ధంలోనే గదా జర్మన్ సామ్రాజ్యవాదులు యింత వరకు చరిత్రలో కనీవినీ ఎరుగనంతటి రాక్షస మిలిటరీ హత్యలు చేయగలిగింది?

—ఈనాడు బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులు కాదా తమ సైన్యాలనూ, జర్మని ఫాసిస్టు తొత్తులనూ, చిన్నదేశాలనూ బలహీనమైన దేశాలను ఆక్రమించుకొని దోపిడిచేయడానికి అపరిమితమైన ఆతురతను ప్రదర్శించుచున్నది?

## సామ్రాజ్యవాదుల పన్నాగాలు

గత యీ రెండు మూడు దశాబ్దాలలో సామ్రాజ్యవాద బందిపోటు దొంగలు నూతన దురాక్రమణ పద్ధతులను తయారుచేసుకొని సిద్ధంగాఉన్నారు. కాని సామ్రాజ్యవాదులు అవలంబించే విధానపు ప్రధాన ఎత్తుగడల విషయంలో (యితర దేశాలలో లోక్యం కల్పించుకోవడం) స్వరూపం మారినా - ముప్పది సంవత్సరాలనాడు లెనిన్ చెప్పిన వివరణ యీనాటికి వర్తిస్తుంది. 1918 జులైలో జర్మన్ సామ్రాజ్యవాదుల ఎత్తుగడలను బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ఎత్తుగడలతో పోలుస్తూ లెనిన్ యిలా వ్రాశాడు:



"బ్రిటన్ యొక్క మిలిటరీ అధికారమంతా ప్రధానంగా వలసదేశాలపైననూ, సముద్రాలపైననూ కేంద్రీకరించబడి ఉన్నది గనుక - ఇది బ్రిటన్‌ను చాల కాలంవరకూ - చాల దశాబ్దాలవరకూ తన దురాక్రమణ దాడులలో తాము ఏకుమ్మక్కనబోతున్న దేశాల సరఫరాలకు ముఖ్యంగా దెబ్బగొట్టడం కాక, ప్రత్యక్షంగా, నేరుగా శక్తివంతంగా దారుణ మిలిటరీ వొత్తిడితోగాక సహాయం చేస్తున్నామనే పేరుతో వారి గొంతుక నులిమివేయడం మొదలుగాగల పద్ధతులను అనుసరించేటట్లు చేసింది."

ఇతర దేశాల ఆంతరంగిక విషయాలలో జోక్యం కలిగించుకొనేందుకు అవలంబించే ఎత్తుగడలలో "సహాయం" పద్ధతీ, "గొంతు నులిమే" పద్ధతినీ యీనాడుకూడా బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తూర్పు అరేబియాలోనూ, పాలస్తీనాలోనూ, ఇండియాలోనూ, ఇరాన్‌లోనూ, సిలోన్‌లోనూ, ఆఫ్రికాలోనూ అనుసరిస్తున్నారు. అయితే మోసంచేసే యీ పితలాటకపు పద్ధతులను, బలహీనపడిపోయిన బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తాము వదులుకొని అమెరికా సామ్రాజ్యవాదులకు అప్పజెప్పారు.

సహాయం పేరిట గొంతులుకోయడమనే యీ పద్ధతి యుద్ధానంతర సంవత్సరాలలో అమెరికా కబంధుని విస్తరణ విధానానికి ముఖ్యంగా ఆటపట్టయింది. మార్షల్ పథకం అనే ఉరిత్రాళ్ళు పశ్చిమ యూరప్ దేశాల మెడలకు తగిలించబడ్డాయి.

ప్రపంచయుద్ధం పరిసమాప్తమైన తరువాత తాము న్యాయమైన శాంతినీ ప్రజాతంత్రాన్ని ప్రసాదిస్తామని ప్రకటించి, బ్రిటిష్, ఫ్రెంచి, అమెరికన్ సామ్రాజ్యవాదులు చేసిన పచ్చి మోసాన్ని 1918, 1919 లలో లెనిన్ నిర్దాక్షిణ్యంగా బట్టబయలుచేశాడు. అమెరికన్ సామ్రాజ్యవాదులూ, వారి యూరోపియన్ ఏజెంట్లు తెచ్చినది ప్రజాతంత్రయుతమైన శాంతి కాక - దోపిడిదొంగల శాంతిఅనీ, యూరప్ దేశాల స్వాతంత్ర్యాన్ని వారు హరించారనీ లెనిన్ తెలియజెప్పాడు.

"ఆస్ట్రియాలో విప్లవాన్ని వారు ఖూనీచేశారు. వారు పోలీసుపని చేస్తారు. స్విట్జర్లండుకు యీవిధంగా శ్రీముఖాన్ని పంపిస్తారు: మీరు బోల్షివిక్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిగే యుద్ధంలో చేరని పక్షంలో మీకు ఆహారపదార్థాలను సరఫరాచేయం. హాలండ్‌కు వారిలా తెలియజేశారు: సోవియట్ రాయబారులను అంగీకరించారంటే ఖబడ్దార్. ఈ మా హెచ్చరికను మీరు పాటించకపోతే, మీతో వర్తక వాణిజ్యాలను బంద్‌చేస్తాం. వారు ప్రయోగించే ఆయుధం చాల సామాన్యమైనది. ఆహారపదార్థాలు అందకుండాచేసి ప్రజలను ఆకలిబాధతో మాడ్చడం."

అప్పటినుండి అమెరికా సామ్రాజ్యవాదులు అంతర్జాతీయ వ్యవహారాలలో అభివృద్ధి నిరోధక శక్తిగా మరింత పెద్దపాత్రను తీసుకోవడం ప్రారంభించారు. వర్సైల్స్ శాంతి ఒడంబడిక జరిగినవెంటనే అమెరికన్ సామ్రాజ్యవాదులు బ్రిటిష్ గుత్తపెట్టుబడిదారులతో మొదటనేకలసి జర్మన్ సామ్రాజ్యవాదుల యుద్ధపరిశ్రమలను పునరుద్ధరించి, జర్మన్ దురాక్రమణను తూర్పువైపుకు - సోవియట్ రిపబ్లిక్‌కు వ్యతిరేకంగా తిప్పడానికి ప్రయత్నించారు.

ఈ రోజున - నూతన పరిస్థితులలో వారు తిరిగి సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకం

గానూ, ప్రజాతంత్రానికి వ్యతిరేకంగానూ జర్మన్ మిలిటరీజాన్ని ఒక ఆయుధంగా ఉపయోగించడానికి సిద్ధపడుతున్నారు. సోవియట్ యూనియన్ అన్నా, ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలన్నా ద్వేషించడం, అభ్యుదయకరంగానూ, ప్రజాతంత్రయుతంగా వున్న దేనినైనా ద్వేషించడం నేడు అమెరికన్ సామ్రాజ్యవాదులయొక్క ప్రత్యేకత. ముప్పది సంవత్సరాల క్రిందట కంటే నేడు వారెక్కువగా ద్వేషభావాన్ని ప్రదర్శించుతూ, ప్రపంచంలో అభివృద్ధినిరోధక శక్తులన్నింటిలోకి కరుడుగట్టిన వారిని సహితం, ఖూనీకోరు ఫ్రాంకో నూ, జర్మనీలో వున్న హిట్లరు అనుయాయులతో సహా—అందరినీ బహిరంగంగా అమెరికా సామ్రాజ్యవాదులు బలపరుస్తున్నారు.

సామ్రాజ్యవాదానికి మిలిటరీజం అభివృద్ధి నిరోధక శక్తులయొక్క అభివృద్ధికీ మధ్యవుండే అత్యంత సన్నిహిత బాంధవ్యాన్ని గురించి లెనిన్ తెలియజేశాడు:

"సామ్రాజ్యవాదం అంటే గుత్తపెట్టుబడిదారీ విధానం (ఇరవయ్యో శతాబ్దంలోనే అది పరిపక్వ దశను పొందింది). దాని ప్రధాన ఆర్థికలక్షణాలనుబట్టే అది శాంతి స్వాతంత్ర్యాలతో చాలకొద్దిసంబంధాన్ని ప్రపంచవ్యాపితంగా ప్రతిచోటా బాగా అభివృద్ధి చెందిన మిలిటరీ తత్వంతో సంబంధాన్ని కలిగి ఉంటుంది."

## మిలిటరిజానికి ప్రతికూలంగా అభ్యుదయశక్తుల సమీకరణ

ఇటీవలచరిత్ర, లెనిన్ చేసిన సిద్ధాంతీకరణను సంపూర్ణంగా 'ధ్రువపరచింది'. ఈసిద్ధాంతీకరణపైననే ఆధారపడి, కామ్రేడ్ స్టాలిన్ సారథ్యాన నడుస్తున్న సోవియట్ విదేశాంగ విధానం మిలిటరీతత్వమూ, అభివృద్ధి నిరోధక శక్తుల అభివృద్ధి చెందడాన్ని అదేపనిగా బట్టబయలు చేసింది; చేస్తున్నది. యుద్ధోన్మాదులను ప్రతిఘటించేందుకు ప్రపంచంలోని అభ్యుదయకర శక్తుల నన్నింటినీ సమీకరించడానికి కృషిచేస్తూ యుద్ధ ప్రమాదాన్ని, మిలిటరీజం పెరుగుదలనూ ఎదుర్కొనేందుకు శక్తివంతములైన మార్గాలనూ సోవియట్ చూపెడుతోంది.

సామ్రాజ్యవాద రాజ్యాల పాలసీని గురించి వివరించుతూ లెనిన్ అంతర్యుద్ధం, విదేశ రాజ్యాల దాడి అంతా ముగిసిన తరువాత అంతర్జాతీయ వ్యవహారాలలోని ఒక

నూతనదశలో సోవియట్ రిపబ్లిక్ ప్రవేశించినదనీ, సామ్రాజ్యవాద కసాయిరాక్షసుల యుద్ధప్రమాదం ఎంతమాత్రం తగ్గదని హెచ్చరిక చేశాడు.

1920 ఆఖరులో లెనిన్ యీ క్రింది విధంగా హెచ్చరించాడు:

"మనకిక యుద్ధప్రమాదం లేదని గ్యారంటీ చేయబడిందని మనమెంత మాత్రమూ చెప్పలేము. బలవత్తర రాజ్యాలలో చాలవాటికి మనతో యుద్ధానికి కాలుదువ్వే తలంపు మానివేయవలసి ఉంటుందనే విషయాన్ని మాత్రం గుర్తించేటట్లు చేయగలిగాం. అయితే అది ఎంత కాలంవరకో - మనం గట్టిగా చెప్పలేము. పరిస్థితులలో పెద్దగా మార్పు లేకుండానే సామ్రాజ్యవాద ఖూనీకోరులు మనపై తిరిగి దాడిచేయడం సంభవిస్తుందని తలంపుతో మనం అందులకు సంసిద్ధులై వుండాలి."

చరిత్ర రుజువుచేసినట్లుగా 1918-20 లలో జరిగిన విదేశ దాడులు విఫలమైన తదనంతరం కూడా సామ్రాజ్యవాదులకూటమి సోవియట్ సోషలిస్టు రాజ్యాన్ని సాయుధబలంతో నులిమివేసే తలంపును మానుకోలేదు. ఈ విషయాన్ని సోవియట్ ప్రజలు ఒక్కనిముషం కూడా మరచిపోలేదు. అందుకనే సోవియట్ తన ఆయుధబలంతో యుద్ధప్రమాదాన్ని ఎదుర్కొడానికి సిద్ధపడుతూ మరొకవైపున యుద్ధనివారణకోసం అన్నిదేశాలు సమిష్టి చర్యను తీసుకోవలసి ఉంటుందని హెచ్చరిక చేయడాన్ని ఎన్నడూ మానలేదు.

1920 తరువాతనూ, ఆ తరువాత 1930 తరువాత కాలంలోనూ లెనిన్ మహాదాశయాన్ని కొనసాగించుతున్న జోసఫ్ స్టాలిన్ నాయకత్వాన సోవియట్ యూనియన్ ఒక్కటే హిట్లర్ముఠాకు చెందిన రాజ్యాల దురాక్రమణ భయాన్ని అదే పనిగా ఎదుర్కొన్నది. సోవియట్ విదేశాంగవిధానం సమిష్టి భద్రతాభావాన్ని ప్రచారం చేసింది; దురాక్రమణ దారులను బట్టబయలు చేసింది. ఆయుధ బలగాలను వీలయినంత ఎక్కువగా తగ్గించేందుకు కృషిచేసింది. నానాజాతిసమితి సమావేశాలలో దురాక్రమణదారులను సమిష్టిగా ఎదుర్కోవాలనే భావాన్ని ప్రచారం చేసింది.

1936 లో కామ్రేడ్ మాలటోవ్ ద్వారా సోవియట్ ప్రభుత్వం వివిధదేశాలనూ, ప్రభుత్వాలనూ "ప్రపంచయుద్ధ ప్రమాదం రోజురోజుకు పెరుగుతున్నదనీ, యూరప్ కంతటికీ ప్రాకుతున్నదనీ" హెచ్చరించింది.

సోవియట్ యూనియన్పై దాడిచేయడానికి ఫాసిస్టులతో డేలును మాలీసుచేస్తున్న బ్రిటిష్, ఫ్రెంచి, అమెరికా పాలకవర్గాలు, యుద్ధప్రమాదాన్ని తప్పించడానికి ఎలాంటి రకమైన చర్యలనూ తీసుకోడానికి నిరాకరించారు.

ఇక ఈపరిస్థితులలో సోవియట్ ప్రభుత్వం ఏవిధంగానూ చలించకుండా లెనిన్ స్టాలిన్ల పంథాననుసరించి దాడిజరిగే పక్షంలో సోవియట్ యూనియన్ హిట్లర్ సైన్యాలను, హిట్లర్ రాజ్యాన్ని హతమార్చేందుకుగాను దేశంయొక్క బలాన్ని గరిష్టసిరివరకు పెంచింది.

రెండో ప్రపంచయుద్ధంలో హిట్లర్ వ్యతిరేక రాజ్యాలను సంఘటితపరచి అక్షరాజ్యాలపై విజయాన్ని సాధించినతరువాత శాశ్వత ప్రజాతంత్రయుతమైన శాంతినీ, బలమైనను శక్తివంతమైన మిత్రరాజ్యసమితి సంస్థనూ నిర్మించాలని సోవియట్ ప్రభుత్వం తన విదేశాంగవిధానంయొక్క ఆశయంగా పెట్టుకొన్నది.

ఈ విధమైన సర్వవ్యాపిత ప్రజాతంత్రయుతమైన శాంతిభద్రతలూ, వివిధ దేశాల మధ్య స్నేహపూరితమైన సహకారమూ సాధించేపంథానే ప్రపంచంలో అన్నిభాగాలలోవున్న దేశాలూ గాఢంగా అభిలషిస్తున్నాయి. కాని బ్రిటన్ పరిపాలకులు, ముఖ్యంగా అమెరికా పాలకవర్గాలు దీనికి సరిగ్గా వ్యతిరేకవైఖరిని అవలంబించుతూ, ప్రపంచాధిపత్యానికి జర్మన్ దురాక్రమణ దారుల అడుగుజాడలలోనే నడుస్తున్నారు.

## ఆటంబాంబుల యుద్ధంతో బెదరింపులు

వారు ఉన్మాదంతో అదేపనిగా ఆయుధ బలగాన్ని పెంచుతున్నారు. నూతన ప్రపంచ యుద్ధానికి డబ్బుకు గడ్డితినే తొత్తులను సంపాదించడానికి అన్నిచోట్లా ప్రయత్నించుతున్నారు. "పశ్చిమ" యూనియన్, 'అట్లాంటి కూటమి, యింకా యితరమిలిటరీ ముఠాలనూ నిర్మించుతూ జర్మన్ మిలిటరీ బందిపోటు దారులను తిరిగి పెంచుతున్నారు. పశ్చిమ యూరప్ రాజ్యాలను లంచాలతో తృప్తిపరిస్తూ సోవియట్ యూనియన్‌నూ ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలనూ ఆటంబాంబుల యుద్ధంతో బెదిరించుతున్నారు.

అయితే వీరి ముప్పు ఎదుర్కోకతప్పదు; తమ జర్మన్ సోదరులు ఎదుర్కొన్న ముప్పు కంటే యింకా ఘోరమైనముప్పు వీరిని ఎదుర్కొంటుంది. యూరప్‌లోని ప్రజలకు, తతిమ్మా ప్రపంచ ప్రజలకూ జరిగిన యీ రెండు ప్రపంచ యుద్ధాలు గుణపాఠాలను నేర్పకుండా వుండలేదు.

1917 లో రష్యాలో జరిగిన నవంబరు సోషలిస్టు విప్లవం మొట్టమొదటిసారిగా, చాల గట్టిగా సామ్రాజ్యవాద దుర్గంలో గండినికొట్టింది. రెండో ప్రపంచ యుద్ధం ముగియడంతో యూరప్‌లోని మధ్య, ఆగ్నేయ ప్రాంతాలలోని అనేక దేశాలు ఆ విధంగానే సామ్రాజ్యవాద గొలుసునుండి బయట పడ్డాయి.

ఫాసిస్టు దురాక్రమణ దారులనుండి, సోవియట్ సైన్యంచే విముక్తిచేయబడిన యీ దేశాల ప్రజలు ప్రజాస్వామిక ప్రజాతంత్ర ప్రభుత్వాలను నెలకొల్పుకొని సోషలిస్టురాస్తాలో జయప్రదంగా పురోగమించు తున్నారు.

ఈనాడు సామ్రాజ్యవాదులకూటమి సోవియట్ యూనియన్ నాయకత్వాన నడుస్తున్న బలవత్తరమైన ప్రజాతంత్రయుత సామ్రాజ్య వ్యతిరేక మహాకూటమితోనూ, - యీ కూటమిని బలపరుస్తున్న ప్రపంచమంతటా వున్న లక్షలాది కష్టజీవులతోనూ చుట్టుముట్టబడి వుంది. ఈ ప్రజాతంత్రకూటమిలోని శక్తులు సంఖ్యలోనూ, బలంలోనూ రోజురోజుకు పెరుగుతూ వుంటాయనే విషయంలో ఎలాంటి సందేహములేదు. అదే సమయంలో దురాక్రమణ నీచ శక్తులతో కూడుకొని వున్న సామ్రాజ్యవాదుల ముఠా ప్రజలనుండి వేరుపడిపోవడం రోజురోజుకు పూర్తిగా ఎక్కువకావడం చూడగలం.

* * *

1919, 1920 లలో లెనిన్ సోవియట్ విదేశాంగ విధానానికి అన్ని దేశాలలోని కష్ట

జీవుల సానుభూతి, సహాయాలున్నాయని ప్రకటించాడు.

అప్పటినుండి సోవియట్ విదేశాంగ విధానానికిగల సహాయసానుభూతులు అన్నిదేశాలలోని ప్రజలలో మరింత ఎక్కువగా పెరిగాయి. ఈ ప్రపంచంలో అత్యధిక సంఖ్యాకులు వివిధ దేశాలమధ్య శాంతి స్నేహ సంబంధాలను పెంపొందించాలనే సోవియట్ పంథానే వాంఛించుతూ యుద్ధోన్మాదుల పాలసీని వ్యతిరేకిస్తారు. ఈనాటి అంతర్జాతీయ వ్యవహార సంబంధాలలో పై విధమైన సహాయసానుభూతులు ఒక మహత్తరమైన చారిత్రక శక్తిగా పరిణమించడం సంభవించుతోంది.

సోవియట్ రాజ్యంయొక్క యావత్తు జీవితంలోనూ దానియొక్క ప్రతిష్టా, విదేశాంగ వ్యవహారాలలో దానిపేరు ప్రతిష్టలూ క్రమేణా హెచ్చడమే జరిగింది.

సోవియట్ విదేశాంగనీతి కష్టజీవుల ప్రయోజనాలకు అనుగుణ్యంగా వుంటూ అది ప్రభుత్వాలతోనే గాక, ప్రజలతో కూడా నరాసరి మాట్లాడటం జరుగుతుంది. సోవియట్ విదేశాంగ నీతి బోల్షివిక్ ఆశయం యెడల భక్తి విశ్వాసాన్ని కలిగి వుండి రాజకీయ పరిస్థితులను సునిశితమైన నిజమైన, శాస్త్రీయ దృష్టితో సిద్ధాంతీకరణ చేస్తుంది.

1920లో లెనిన్ యిలా వ్యాఖ్యానించాడు:

“నిష్కపటంగా, విస్పష్టంగా ప్రకటనల చేసే పద్ధతిని బూర్జువా విదేశాంగనీతి అర్థంచేసుకోలేని విషయం. ఇదే మన నూతన విదేశాంగనీతిని దానినుండి వేరుపరచి ప్రత్యేకంగా చూపెట్టేది.”

ఆయనింకా యిలా వ్రాశాడు:

“ఈ పాతప్రపంచానికి పాతవిదేశాంగ నీతే వుంది. ఈ పాతవిదేశాంగనీతి స్పష్టంగా, నిష్కపటంగా మాట్లాడటం సాధ్యపడుతుందనే విషయాన్ని ఏమాత్రం నమ్మలేదు.”

ఈ ముప్ఫయిసంవత్సరాలూ అభివృద్ధి నిరోధక పాలకులకు యీ సందర్భంలో ఎలాంటి పాఠాలను నేర్పలేకపోయాయి. కాని ప్రపంచాధిపత్యానికి అర్రులుచాస్తున్న నూతన దురాక్రమణదారులనూ, శాంతిశక్తులను విచ్ఛిన్నపరచేందుకు చేసే కుయుక్తులనూ నసురూబెదురూ లేకుండా, ఖచ్చితంగా బట్టబయలు చేస్తున్న సోవియట్ లెనిన్ - స్టాలిన్ల విదేశాంగ విధానంయొక్క వాణిని శ్రద్ధగా వింటున్న ప్రజానీకానికి ముప్ఫయి సంవత్సరాలూ చాల అమోఘమైన విషయాలను నేర్పాయి.

అంతర్జాతీయ పరిస్థితులు విషమపరిస్థితిలో వున్న సమయాలలో విదేశాంగవిధానంలో అలాంటి నిష్కపటత్వం వుండవలసిన అవసరాన్ని లెనిన్ ప్రత్యేకంగా నొక్కిచెప్పాడు:

“మన అంతర్జాతీయ సంబంధాలలో మితిమీరిన పరిస్థితులు ఏర్పడినప్పుడల్లా ఆ విషయాన్ని గురించి బహిరంగంగా తెలియజేస్తూ మాట్లాడటం తప్పని సరిగా అవసరం.”

ప్రజలను ఎదుర్కొనబోయే ప్రమాదాన్ని గురించి ప్రజలను సకాలంలో హెచ్చరిస్తూ వుండాలనే యీ లెనిన్ - స్టాలిన్ల సిద్ధాంతాన్ని సోవియట్ విదేశాంగ విధానం చలించకుండా ఆచరణలో పెడుతోంది.

1934లో స్టాలిన్‌తో జరిగిన సంభాషణలో లెనిన్ సోవియట్ రష్యా అనుసరిస్తున్న విదేశాంగ విధానాన్ని గురించీ, సోవియట్ రాజ్యాన్ని సామ్రాజ్యవాదులు చుట్టుముట్టుతున్న విషయాన్ని గురించి మాట్లాడాడు.

"వారు స్వార్థపరులు. ఒకరినొకరు విపరీతంగా ద్వేషించుకొంటారు. వారు తమలో తాము తన్నుకోవడానికి సిద్ధపడతారు. మనంమాత్రం తొందరపడవలసిన పనిలేదు. మనం శాంతికి, సఖ్యతకు నిలబడతాం. కాని దురాక్రమణకూ, దురాక్రమణ సంధి షరతులకూ మనం వ్యతిరేకం. మన ఆశయమనే చుక్కానిని మనం వుంచుకొని జాగ్రత్తగా, దృఢంగా మన మార్గాన మనం మనం నడవాలి. మనమార్గమధ్యంలో మనం పొగడ్తలకుగాని, బెదిరింపులకుగాని లొంగిపోయి మార్గం తప్పరాదు."

గత మూడు దశాబ్దాలచరిత్ర లెనిన్ స్టాలిన్ల విదేశాంగవిధానం సరైనదని పూర్తి ధృవపరచింది.

మహత్తరమైన సోవియట్ రాజ్యనావకు మహాసారధి, కామ్రేడ్ స్టాలిన్. చుక్కానిని తన చేతులలో జాగ్రత్తగా వుంచుకొని సోవియట్ రాజ్య విదేశాంగ విధానాన్ని సామ్రాజ్యవాద దుష్టశక్తులకు వ్యతిరేకంగా అభ్యుదయ మానవజాతి విజయానికి దారితీసే ఒకే ఒక బాటను నడుపుతున్నాడు.

—న్యూటైమ్సు
(1949 లో 4 సంచిక)

---

"పెట్టుబడిదారులవంక చూడండి! అన్నిజాతులకూ, అన్నిమతాలకూ చెందిన పెట్టుబడిదారులు కార్మికులకు వ్యతిరేకంగా ఏకమవుతున్నారు. కాని మరోవైపున వారే కార్మికులలో జాతివైషమ్యాన్ని ప్రవేశపెట్టడంద్వారా వారిని చీల్చి, బలహీన పరచడానికి ప్రయత్నించుతున్నారు."

— లెనిన్

(లెనిన్ గ్రంథావళి రష్యన్ ప్రతి 16 వ సంపుటం 554 పేజీ)



# బూర్జువా జాతీయ పోకడలు

—ప్రొఫెసర్ ఇ. స్టీక్‌బర్గ్

ద్వితీయ ప్రపంచయుద్ధంలో ఫాసిస్టు జర్మనీ, జపాన్ దేశాలు పూర్తిగా ఓడిపోయ్యాయి. ఈ యుద్ధఫలితంగా ప్రపంచమంతటా ప్రజాస్వామికోద్యమం అతితీవ్రంగా విజృంభించింది: సామ్రాజ్యవాదులతో రాజీకోసం ప్రాకులాడే అభివృద్ధి నిరోధకమైన బూర్జువా 'ప్రజాస్వామికానికి యుద్ధానంతరం విజృంభించిన ప్రజాస్వామికోద్యమం స్వస్తి చెప్పింది. అభ్యుదయకరమైన ఒక నూతన సమాజాన్ని నిర్మించడంకోసం పెట్టుబడిదారీ బానిసత్వంనుంచి విముక్తి పొందడానికి సాగించే పోరాటంగా ఈఉద్యమం దినదినాభివృద్ధి చెందుతూఉంది. ప్రజాస్వామిక ప్రజాతంత్రం అనేభావం నేడు సోషలిజంతో పూర్తిగా పెనవేసుకొనిపోయింది. ప్రజాస్వామిక ప్రజాతంత్రాన్ని సోషలిజంనుంచి విడదీసి వేరుగా పరిగణించడం సాధ్యంకాదు. అందువల్లనే కార్మికవర్గమూ, ఆ వర్గానికి అగ్రగామిదళంగాఉండే కమ్యూనిస్టు పార్టీలు ప్రపంచ ప్రజాస్వామిక శిబిరానికి నాయకత్వం వహించి నడుపుతూ ఉండడం యాదృచ్ఛికంగా జరిగిన ఒక సంఘటన కాదు.

ఇటీవలి సంవత్సరాల్లో ప్రపంచ ప్రజాస్వామికోద్యమం అనేక ఘన విజయాలను సాధించింది. పోలండు, జెకోస్లోవేకియా, బల్గేరియా, రుమేనియా, హంగెరీ, అల్బేనియా దేశాల్లో ప్రజాస్వామిక ప్రజాతంత్రం బాగా వేరూని బలపడుతూఉంది. ఈ దేశాలు పెట్టుబడిదారీ విధానంనుంచి సోషలిస్టువిధానంలోకి మారుతూ ఉన్నాయి. అమెరికా సామ్రాజ్యవాదులకు ఏజంట్లుగా పనిచేస్తోన్న క్యోమింటాంగ్ ముఠాపై చైనా ప్రజాస్వామిక శక్తులు అంతిమ విజయాన్ని సాధించే సమయం సమీపిస్తూఉంది. ఒకమహాప్రవాహం లాగాపొంగిపొంలే జాతీయ విముక్తి ఉద్యమం చైనానంతనూ ముంచేసి ఇండియా, బర్మా, వీత్‌నాం, ఇండోనేషియా, మలయా దేశాల్లో కూడా వ్యాపిస్తూఉంది. ప్రపంచ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సాగించే పోరాటంలో వివిధ దేశాల కార్మిక వర్గానికీ జాతులకూ మధ్య సుహృద్భావపూరిత సంబంధాలు రోజురోజుకు దృఢతరం అవుతున్నాయి. ప్రజాస్వామికం కోసం, సోషలిజంకోసం పోట్లాడే ఈప్రపంచ ప్రజాసైనికదళం తన సభ్యుల్ని బలపరుచు

కోడం చేశు అన్నిటికంటె అత్యవసరం. కార్మిక ప్రజల సునిశిత దృష్టిని మందగింప చేయడానికీ వారిలో ఉండే స్నేహపూర్వ ఐక్యతను విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నించే కార్మిక శత్రువుల అభివృద్ధి నిరోధక ప్రభావానికి కార్మిక ప్రజలు లోనుగాకుండా ఉండాలంటే బూర్జువా జాతీయ పోకడలను వ్యతిరేకంగా కార్మిక ప్రజలు తీవ్రంగా పోరాడవలసి ఉంటుంది.

జాతీయత అనేది బూర్జువావర్గం యొక్క పాలసీ. దోపిడీదార్లకు వ్యతిరేకంగా కార్మిక ప్రజలు సాగించే వర్గపోరాటన్ని బలహీనపరచడానికి వివిధ దేశాల్లో వున్న శ్రామిక వర్గమూ, విప్లవ ప్రజాస్వామిక శక్తులూ ఐక్యంగాఉండా నిరోధించడానికీ సామ్రాజ్యవాద బూర్జువా వర్గం జాతీయ దురహంకార పూరిత భావాలను రెచ్చగొడుతూ వుంది. కాని శ్రామికవర్గం మౌలికం సహజసిద్ధంగానే అంతర్జాతీయ స్వభావం కలిగి ఉంటుంది. పెట్టుబడిదారీ వర్గం యొక్క అధికారాన్ని తొలగించి సోషలిస్టు సమాజాన్ని స్థాపించడమే శ్రామికవర్గంయొక్క ప్రధాన ఆశయం. కాబట్టి ఆ ఆశయమే ప్రపంచంలో దోపిడి చేయబడే కార్మిక ప్రజలందరూ ఐక్యంకావడం ఎంతైనా అవసరం అని వారు గుర్తించేలా చేస్తుంది.

శ్రామికవర్గ అంతర్జాతీయత అనే ఈ రెండు నినాదాలూ పెట్టుబడిదారీ ప్రపంచంలోని రెండు ప్రధాన వర్గ శిబిరాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నాయనీ, ఈ రెండు నినాదాలు ఒకదానికొకటి పూర్తిగా విరుద్ధమైనవనీ, జాతుల సమస్యపై ఈ రెండు నినాదాలు రెండు విధాల పాలసీని (పాలసీని కాదు రెండు ప్రపంచ దృక్పథాలను) తెలియ జేస్తున్నాయనీ కామ్రేడ్ లెనిన్ వ్రాశాడు.

లెనినిజంలో అత్యంత ప్రధానమైన ఈ సిద్ధాంతాన్ని నిర్లక్ష్యం చేసేవారు వెంటనే కానీ, లేక కొంచెం ఆలస్యంగా కానీ అంతర్జాతీయ ప్రజాస్వామికోద్యమంయొక్క ఆశయానికి ద్రోహం చేసి బూర్జువా అభివృద్ధి నిరోధక తత్వం అనే ఊబిలో దిగబడతారు.

శ్రామికవర్గం నిర్వహించవలసిన వర్గబాధ్యతలనూ, అంతర్జాతీయ శ్రామికవర్గ ఐక్యతనూ తక్కువ అంచనావేయడంలోనూ, జాతీయతనూ, జాతీయ కర్తవ్యాలనూ ఎక్కువ అంచనా వేయడంలోనూ బూర్జువా జాతీయ తప్పుడు పోకడలు గోచరిస్తాయి. సోషలిజం కోసం కార్మికవర్గం సాగించే పోరాటానికి తగిన ప్రాముఖ్యత ఇవ్వకుండా దాన్ని తోసిపుచ్చి బూర్జువా జాతీయవాదులు తమ దేశంలోని జాతీయోద్యమాన్నే తమ ఆశయంగా సర్వ సంపూర్ణంగా భావిస్తారు. దీని ఫలితంగా వారు సోషలిజాన్ని వదలి పెడదారిబట్టి పెట్టుబడిదారీ వర్గాధికారాన్ని సురక్షితంగా ఉంచేందుకు దోపిడివర్గాలకు తోడ్పడతారు. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 17వ కాంగ్రెసులో బూర్జువా జాతీయ పోకడలను గురించి కామ్రేడ్ స్టాలిన్ సమగ్రంగా, క్షుణ్ణంగా చర్చించాడు.

"జాతీయత వైపు దిగజారడమూ కే కార్మికవర్గంయొక్క అంతర్జాతీయ పాలసీని బూర్జువావర్గంయొక్క జాతీయ పాలసీకి దిగజార్చడమే" అని కామ్రేడ్ స్టాలిన్ నిర్వచించాడు.

కామ్రేడ్ స్టాలిన్ చెప్పిన ప్రతిఅక్షరం సత్యం అని నేటి యుగోస్లావియా పరిస్థితులే ఋజువుపరిచాయి. బూర్జువా జాతీయ పెడదారులు తొక్కిన ఫలితంగా టిటో ముఠా, యుగోస్లావియాలో వర్గపోరాటం అంతరించి పోయిందనే అభివృద్ధి నిరోధక తప్పుడు సిద్ధాంతాన్ని చేపట్టింది. మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలనుంచి దిగజారి కులక్ (ధనిక రైతుల) సిద్ధాంతాలకు తల ఒగ్గింది. విముక్తి ఉద్యమంలో కార్మికవర్గంయొక్క నాయకత్వం అనే లెనినిస్టు సిద్ధాంతానికి స్వస్తిచెప్పి ప్రజాస్వామిక ప్రజాతంత్ర విధానానికి "రైతాంగాన్ని ప్రధానాంగంగా" స్వీకరించింది. కమ్యూనిస్టుపార్టీ పెట్టిప్రాముఖ్యతా లేకుండా చేసి పీపుల్స్ ఫ్రంటులో పార్టీని కలిపివేసింది. సోషలిస్టు సమాజనిర్మాణం అనే పదాడంబరం చాటున దోపిడీ వర్గాలకూ ధనిక రైతువర్గాలకూ ప్రోత్సాహం ఇవ్వడం జరిగింది. యుగోస్లావియా ప్రభుత్వం అవలంబించే విదేశాంగ విధానంలోనూ, ఆల్బేనియా, బల్గేరియా దేశాల పట్ల దురాక్రమణ పాలసీని అవలంబించడంలోనూ, సోదర కమ్యూనిస్టు పార్టీలతో తదితర ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాలతోనూ సంబంధాలు తెంచుకోవడంలోనూ, సోవియట్ యూనియన్‌పట్ల వ్యతిరేక దృక్పథం అవలంబించడంలోనూ, టిటో ముఠా జాతీయ తప్పుడు పోకడలు స్పష్టంగా గోచరిస్తాయి. టిటో ముఠా అనుసరించే విద్రోహపూరిత విధానం ప్రపంచ ప్రజాస్వామిక శిబిరానికి హానికరంగా పరిణమించిందనడంలోగానీ, సామ్రాజ్యవాదుల శిబిరంలో టిటో ముఠా చేరుతూ వుండడంలోగానీ, ఎట్టి సందేహానికి తావులేదు. టిటో ముఠా రోజురోజుకూ దిగజారి బ్రిటిష్, అమెరికా సామ్రాజ్యవాదుల మెహర్బానీకోసం బహిరంగంగా కొంగు జాచడం ఈ బూర్జువా జాతీయ తప్పుడు పోకడల ఫలితమే.

బూర్జువా జాతీయవాదం చివరకు సామ్రాజ్యవాదులకు దాసోహం అనడానికే దారితీస్తుంది. బూర్జువా జాతీయ తప్పుడు పోకడలను సకాలంలో గ్రహించి వాటిని బట్టబయలు చేస్తే వాటి ప్రమాదాన్ని తగ్గించడానికీ చివరకు వాటిని పూర్తిగా తొలగించడానికీ సాధ్యమవుతుందని చరిత్ర మనకు తెలియజేస్తుంది. జోసెఫ్ స్టాలిన్ నాయకత్వాన సోవియట్ యూనియన్‌లో ఇదేవిధంగా చేయడం జరిగింది. తత్ఫలితంగా బూర్జువా జాతీయవాదం సోవియట్ యూనియన్‌లో సమూలంగా నిర్మూలించబడింది. ఇదేవిధంగా పోలండు, జెకోస్లోవేకియా, ఆల్బేనియా, హంగెరీ, బల్గేరియా దేశాల్లో అంతర్గతంగా, బహిరంగంగా ఉన్న జాతీయ తప్పుడుపోకడలకు వ్యతిరేకంగా నిరంతర పోరాటం సాగించబడింది.

బూర్జువా జాతీయ తప్పుడు పోకడలను అమలుజరిపే టిటో ముఠా యుగోస్లావియా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన్ని చేజిక్కించు

కొని తన తప్పులను విమర్శించేవారిపై అన్ని విధాల నిర్బంధచర్యలనూ, జైలుశిక్షనుంచి హత్యలవరకూ - అమలుజరుపుతూ ఉంది. టిటో ముఠా నాయకత్వం సోషలిజానికీ, ప్రజాస్వామిక ప్రజాతంత్రానికీ, కార్మికవర్గానికీ, కష్టజీవులైన రైతాంగానికీ వారి ఆశయాలకూ, యుగోస్లావియా జాతీయ స్వాతంత్ర్యానికీ హానికరంగా పరిణమించింది.

బూర్జువా జాతీయ తప్పుడు పోకడలకు వ్యతిరేకంగా సాగించే పోరాటంలో బహు జాగరూకతగా సునిశితదృష్టితో ప్రవర్తించవలసి ఉంటుంది. చరిత్ర, రాజకీయార్థికశాస్త్రం, సమాజశాస్త్రం, న్యాయశాస్త్రం, సాహిత్య విమర్శలాంటి శాస్త్రీయ సిద్ధాంతాల ముసుగులో బూర్జువా జాతీయభావాలు తరచుగా మరుగుపడి ఉంటాయి. ఒకానొక జాతికి సంబంధించిన ప్రాచీన చారిత్రక సంఘటలను ఆదర్శప్రాయంగా చిత్రించి చరిత్రలోని వర్గపోరాటాలను కప్పిపుచ్చడంలోనూ, సాంఘిక అంతరంగికాభివృద్ధి క్రమాన్ని వైరుధ్యంలేని ఒకే 'ఐక్య ప్రవాహం'గా చిత్రించడంలోనూ ఈ బూర్జువా జాతీయభావాలు ద్యోతకమవుతూ ఉంటాయి. ఈ భావాలు మొదట ఎంత అస్పష్టంగా ఉన్నా, పైకి ఎంత ప్రమాదరహితంగా కనిపించినా, వీటిని ప్రతి కమ్యూనిస్టూ, నిజాయితీకలిగిన ప్రతి ప్రజాస్వామికవాదీ, ఎదిరించి నిర్మొగమాటంగా, తీవ్రంగా పోరాటం జరపవలసి ఉంటుంది. బూర్జువా జాతీయ పెడదారులపట్ల ఉపేక్షాభావం వహించడం మార్క్సిజం - లెనినిజంయొక్క శ్రామికవర్గ అంతర్జాతీయ సిద్ధాంతాల బోధనలో పార్టీ కేడర్లనూ, కార్మిక ప్రజాసామాన్యాన్నీ సుశిక్షితులుగా చేయడానికి పెద్ద ఆటంకాన్ని కలిగిస్తుంది.

బూర్జువా పరిసర వాతావరణంలోనే జాతీయ తప్పుడు పోకడలు వ్రేళ్లు నాటుకొని ఉంటాయి. పెట్టుబడిదారీ దేశాల్లోనూ, ప్రజాస్వామిక ప్రజాతంత్ర విధానంలో ప్రవేశించి ఇంకా పెట్టుబడిదారీవర్గాలూ, పెట్టుబడిదారీ సంబంధాలూ ఉన్న దేశాల్లోనూ కార్మికవర్గం ఈ బూర్జువా పరిసరవాతావరణాన్ని సూటిగా ఎదుర్కోవలసి వస్తోంది.

ఒక రూపంలోనో, మరోరూపంలోనో బూర్జువా సమాజంతో సంబంధాలు కలిగిఉన్న కొందరు శ్రామికుల ద్వారా బూర్జువా భావాలు ప్రవర్తన విధులూ, ఆచారాలూ, సాంప్రదాయాలూ శ్రామికవర్గంలో ప్రవేశించి శ్రామికవర్గంపైనా, ఆవర్గంయొక్క పార్టీపైనా బూర్జువా సిద్ధాంతాల ప్రభావాన్ని కలిగిస్తాయి అని కామ్రేడ్ స్టాలిన్ మనకు బోధించాడు.

ప్రజాస్వామికోద్యమాన్ని తప్పుదారులను బట్టించడానికీ, బలహీనపరచడానికీ బూర్జువా జాతీయత అనే ప్రభావ సిద్ధాంతాయుధాన్ని బూర్జువావర్గం చాలా బలంగా ప్రయోగిస్తుంది.

విదేశీ సామ్రాజ్యవాదుల పరిపాలన క్రింద ఉన్న దేశాలకూ, ఇటీవలదాకా విదేశీ సామ్రాజ్యవాదుల క్రింద వున్న దేశాలకూ ఇది ముఖ్యంగా వర్తిస్తుంది. విదేశీ సామ్రాజ్యవాదుల పరపాలన క్రింద తమ జాతీయ ప్రతిష్ఠ ఏవిధంగా దెబ్బతిని పోయిందో ఆ అనుభవం ప్రజల మనస్సుల్లో ఇంకా సజీవంగానే ఉండడంవల్ల అది జాతీయతా

ప్రచారానికి అనువైన ఒక చక్కటి అవకాశాన్ని కలుగ జేస్తుంది.

తూర్పుదేశాల పీడితప్రజలు తమ స్వాతంత్ర్యంకోసం సాగించే పోరాటాలయొక్క విప్లవ ప్రాముఖ్యతను కించెపరచజూచే అవకాశవాదులవలెగాక అంతర్జాతీయ విముక్తి ఉద్యమంలో ఈ పోరాటాలను ఒక ప్రధాన భాగంగా లెనినిజం పరిగణిస్తుంది. వలసదేశాలూ అర్ధవలస దేశాలూ సాగించే జాతీయ విముక్తి ఉద్యమంలో కమ్యూనిస్టుపార్టీలు ప్రముఖంగా పాల్గొనాలని, మాటల్లో గాకుండా క్రియలో సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా పోరాడుతూన్నంత వరకు బూర్జువా జాతీయ పార్టీలతో కలిసి కమ్యూనిస్టుపార్టీలు ఒక సంఘటనగా ఏర్పడి పనిచేయాలనీ లెనిన్, స్టాలిన్‌లు బోధించారు. ఆవిధంగా కలిసి పోరాడుతూనే ఆయాదేశాల కమ్యూనిస్టుపార్టీలు తమ స్వతంత్ర ప్రతిపత్తిని నిలబెట్టుకోవాలనీ, తాము నిర్వచించవలసిన ప్రత్యేక వర్గ బాధ్యతలను ఎల్లప్పుడూ దృష్టిలో బెట్టుకొని బూర్జువా జాతీయ వాతావరణంలో తాముకూడా విలీనమైపోకుండా చూచుకోవాలని కూడా లెనిన్, స్టాలిన్‌లు సూచించారు.

గత మూడు దశాబ్దాలనుంచీ జరిగిన తూర్పుదేశాల జాతీయ స్వాతంత్ర్య పోరాట చరిత్ర మనకు అనేక గుణపాఠాలను నేర్పుతూ ఉంది. కమ్యూనిస్టుపార్టీలు ఏవిధంగా ఎక్కడ బూర్జువా జాతీయ పెత్తదారులు త్రొక్కటి ఆ చరిత్రద్వారా మనం నేర్చుకోవచ్చు. చైనాలో చంగ్-టు-సీ, ఇండియాలో యం. యన్. రాయ్ ఇదే విధంగా బూర్జువాజాతీయ పెత్తదారులు త్రొక్కి జాతీయ విముక్తి ఉద్యమ శిబిరంలో నుంచి చీలి సామ్రాజ్యవాద శిబిరంలో చేరిపోయారు.

ఈ గుణపాఠాలను మన మెప్పుడూ మరచి పోరాదు.

ప్రపంచ ప్రజాస్వామికోద్యమంలో శ్రామికవర్గ అంతర్జాతీయతను ఎవరెవరు బలపరుస్తూన్నదీ, లేనిదీ తెలుసుకోడానికి సోవియట్ యూనియన్ పట్ల వారవలంబించే వైఖరియే ఒక ప్రధాన గీటురాయి. సామ్రాజ్యవాదుల ప్రయోజనాలకోసం వివిధదేశాల బూర్జువా జాతీయవాదులు తమదేశ ప్రజలను సోవియట్ యూనియన్‌కు విముఖులుగా తయారుచేస్తూ ఉండడం నేడు మనందరికీ తెలిసిన విషయమే. ఈ విషయంలో యుగోస్లావియాలోని టిటో ముఠా ఇదివరకే హద్దులు దాటిపోయింది. సోవియట్ ప్రభుత్వానికీ, సోవియట్ కమ్యూనిస్టు పార్టీకీ వ్యతిరేకంగా పచ్చి అబద్ధాలు ప్రచారం చేయడానికి పూనుకుంది. అంతర్జాతీయ ప్రజాస్వామికానికీ, సోషలిజానికీ ఇంతకంటె ద్రోహపూరితమైన కార్యం మరేం ఉంటుంది?

ప్రపంచచరిత్రలో మహత్తరమైన నవంబరు సోషలిస్టు విప్లవం జరిగినప్పటినుంచీ సోషలిస్టు భూమి అయిన సోవియట్ యూనియన్ పీడిత ప్రపంచ ప్రజలకందరికీ తాము సాగించే

సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో ఒక పెట్టనికోటగా - ఒక ఆకాశజ్యోతిగా - వెలుగొందుతూ ఉంది. మార్క్సిజం - లెనినిజం యొక్క అభ్యుదయకర స్వాతంత్ర్య భావాలకు ఒక ప్రధాన కేంద్రంగా ఉంది. 1926 లో జోసెఫ్ స్టాలిన్ చెప్పినట్లుగా సోవియట్ శ్రామికవర్గ యొక్క ప్రయోజనాలూ కర్తవ్యాలూ అన్ని దేశాల్లోని విప్లవోద్యమాల ప్రయోజనాలతోనూ కర్తవ్యాలతోనూ మిళితమైపోయాయి. అదేవిధంగా వివిధదేశాల్లోని విప్లవకర శ్రామికవర్గ కర్తవ్యాలు సోషలిస్టు సమాజ నిర్మాణంలో సోవియట్ శ్రామిక వర్గం సాధించే విజయాలతోనూ, కర్తవ్యాలతోనూ పెనవేసుకొని పోయ్యాయి. ఒకదాని నుంచి మరొకటి విడదీయడానికి వీలులేదు.

అందువల్ల ఏ ఒక దేశం యొక్క శ్రామిక వర్గ 'జాతీయ' కర్తవ్యాలను ఆవర్గం యొక్క అంతర్జాతీయ కర్తవ్యాలకు పోటీగా పెట్టడం అంటే పాలసీలో బ్రహ్మాండమైన తప్పుచేయడమే అని కామ్రేడ్ స్టాలిన్ చెప్పాడు.

కామ్రేడ్ స్టాలిన్ పైమాటలు జెప్పి ఇప్పటికి 22 సంవత్సరాలు దాటిపోయ్యాయి. ఈ 22 సంవత్సరాల్లో కామ్రేడ్ స్టాలిన్ నాయకత్వాన సోవియట్ యూనియన్ అనేక మహత్తర విజయాలనుసాధించింది. బ్రహ్మాండమైన శక్తిగల ఒకసోషలిస్టు దేశంగా అభివృద్ధి చెందింది. ఫాసిస్టు దాస్యానికి గురికాకుండా యావత్ ప్రపంచాన్ని కాపాడింది. శాంతికీ ప్రజాస్వామికానికీ, సోషలిజానికీ సోవియట్ యూనియన్ పెద్దోక పెట్టని కోటగా ఉంది. అభివృద్ధి నిరోధకులైన సామ్రాజ్య వాదుల ఆటలను అరికడుతూ ప్రపంచ ప్రజాస్వామిక శిబిరానికి అగ్రస్థానంలో ఉండి ముందు నడుస్తూవుంది. కాబట్టి చైతన్యం కలిగిన, నిజాయితీ కలిగిన ప్రపంచ ప్రజాస్వామిక వాదులందరూ అభ్యుదయ కాముకులైన మానవులందరూ సోషలిస్టు భూమి అయిన సోవియట్ యూనియన్‌తో తమ క్షేమ సంబంధం లేనట్లు ఉండజాలరు.

బూర్జువా జాతీయత అనేది సామ్రాజ్య వాద శిబిరం ఉపయోగించే ఒక ప్రధానాయుధం. కాబట్టి అందులోవున్న బండారాన్ని కమ్యూనిస్టు పార్టీలు ఎప్పటికప్పుడు బట్టబయలు చేయవలసి ఉంటుంది. సామ్రాజ్య వాద శక్తులపై ప్రజాస్వామిక శక్తులు విజయం సాధించాలంటే ఈ బాధ్యతను కమ్యూనిస్టు పార్టీలు సక్రమంగా నిర్వహించడం, లెనిన్ స్టాలిన్‌ల అంతర్జాతీయతా సిద్ధాంతంలో ప్రజలకు శిక్షణ ఇవ్వడం అత్యంతావసరం.

—"న్యూస్ అండ్ వ్యూస్ ఫ్రంది సోవియట్ యూనియన్"

(17-2-1949)



# వార్తలూ - విశేషాలు

## విజ్ఞానశాస్త్ర చర్చలందు సోవియట్ పత్రికా పాఠకులకున్న అత్యున్నత అభిరుచి

1948 వేసవిలో ప్రపంచంలోని అన్ని చోట్లా పత్రికలు, జరుగుతున్న యుద్ధాలను గురించీ, అతి భయంకరమైన ఆటం యుద్ధాలను గురించీ, ఆటంబాంబులను స్వాధీనంలో ఉంచుకొని సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా సాగించే వారి యుద్ధప్రయత్నాలను గురించీ, - యింకా యితర సంఘర్షణలను గురించీ వార్తలను కుప్పలుతిప్పలుగా ప్రకటిస్తున్నాయి. అదే సమయంలో మాస్కోలో ప్రధాన పత్రిక "ప్రవద", కొన్ని వందల లక్షల ప్రజలకోసం, లక్షల కాపీలను అచ్చువేస్తోంది. అయితే అందులో ప్రచురించి, ప్రజల కందజేసే విషయాలేమిటి? జులై 31 వ తేదీన సోవియట్ 'వ్యవసాయ శాస్త్రాల ఎకాడమీ' మహాసభ ప్రారంభమైంది. ఆగస్టు 4 వ తేదీనుండి ఆగస్టు 12 వరకు 'ప్రవద' పత్రిక తన సంచికలలో ఎక్కువభాగాన్ని యీ మహాసభలో జరిగే చర్చ ప్రచురించడం కోసం వినియోగించింది. ఈ రోజులలో 44 పేజీలలోనూ, 18 పేజీలను పూర్తిగా యీ మహాసభ విశేషాలకే ఖర్చుపెట్టింది.

ఈవిధంగా ఏఘటనా - బెర్లిన్ సమస్యకు గాని, బెల్‌గ్రేడ్ కాన్ఫరెన్సుకుగానీ, వాషింగ్టన్‌లో జరిగే సోవియట్ ప్రతికూల సంఘటనలకు గాని సోవియట్ పత్రికలు "నేటి జీవశాస్త్రాన్ని" గురించిన చర్చలకు ఇచ్చిన ప్రాధాన్యతను ఇచ్చియుండలేదు. సోవియట్ ప్రఖ్యాత శాస్త్రవేత్త లైసెంకో రిపోర్టులో రెండు రకాలభావాలను వెలిబుచ్చిన శాస్త్రవేత్తల చర్చ ప్రారంభమైంది. వారిచ్చిన రిపోర్టులు 500 అచ్చు పేజీలకు పైగా ఉంటుంది.

ఇంతవరకు ఏ దేశంలోనూ, మానవజాతి చరిత్రలో మరే సమయంలోనూ శాస్త్రచర్చల విషయంలో ఇంత యెక్కువగా పత్రికలు ప్రకటించి యుండలేదు. లక్షలాది సోవియట్ స్త్రీపురుషులు ఈ చర్చలలోను శ్రద్ధతీసుకొని చాల జాగ్రత్తగా చదివారు. ఇలాంటి సంఘటన ఫ్రాన్సులో జరగడం ఊహించరాని విషయం. శాస్త్రచర్చలకు యింత స్థలాన్ని ఏ వార్తాపత్రికా వినియోగించదు, అలా ప్రకటించితే చదివే పాఠకులు కూడా వుండరు. ఇంతటి శాస్త్రచర్చలను శ్రద్ధగా చదివే పాఠ

కులే నాగరికతశిఖరాల నంపుకొన్నది అని అనబడే ఫ్రాన్సులో వుండరంటే నమ్మండి. అందుకనే ఫ్రాన్సులో ఏపత్రికకూ శాస్త్రచర్చలకు యింత స్థలాన్ని వినియోగించే దమ్ములుండవు. అలా ప్రచురించితే కాపీలు అమ్ముడుపోక పత్రికా యజమాని నష్టపడిపోవలసి వస్తుంది.

చర్చల ధోరణి ఎలా ఉన్నప్పటికీ సోవియట్ పత్రికలు శాస్త్రచర్చలకు యింతటి ప్రచురణ యివ్వగలిగాయంటే ఒక్క విషయాన్ని మాత్రము అందరూ గుర్తించి తీరాలి.

సోవియట్ యూనియన్‌లో శాస్త్రవేత్తలమధ్య జీవశాస్త్రాన్ని (బయాలజీ) గురించి జరుగుతున్న చర్చలలో శ్రద్ధగా పాల్గొనగల లక్షలాది పత్రికా పాఠకులతో కూడిన ఒక కొత్తరకపు "మేధావి వర్గం" తయారైందని రూఢిగా చెప్పవచ్చు.

— లూయీ అరగాన్
(ఫ్రెంచి మహాకవి)
"మాసస్ అండ్ మైన్‌స్ట్రీమ్" అనే
అమెరికా పత్రికనుంచి.

# జపాన్ మేధావుల ఫాసిస్టు వ్యతిరేక మహాసభ

జపాన్ మేధావుల ఫాసిస్టువ్యతిరేక మహాసభ ఇటీవల టోకియోలో జరిగింది. ఈ మహాసభ ప్రపంచమంతటా వున్న మేధావులకు సందేశాన్ని పంపించింది. అందులో యిలావుంది:

"మా దేశంలో తిరిగి తలెత్తుతున్న ఫాసిస్టు ప్రమాదానికి వ్యతిరేకంగా జపాన్ మేధావులమైన మేము పోరాడుతున్నాం."

ఈ మహాసభకు 700 ప్రతినిధులు దేశంలోని వివిధ ప్రాంతాలనుండి హాజరయ్యారు. ఇందులో ప్రముఖ రచయితలు, విమర్శకులు, సంగీత విద్వాంసులు, యితర కళాకారులూ ఉన్నారు. వారంతా "జపాన్‌ను ప్రజాతంత్ర దేశంగా పునరుద్ధరించి ప్రపంచ శాంతికీ, మానవజాతి పురోగమనానికి తమవంతు కర్తవ్యాన్ని నిర్వహించడానికి" తమ దృఢనిశ్చయాన్ని ప్రకటించారు.

"ప్రపంచంలో వున్న అభ్యుదయ మేధావులతో అన్నివిధాలా సహకరించుతామని" ప్రతినిధులు ప్రతిజ్ఞ చేస్తూ జపాన్ అభ్యుదయ మేధావుల పోరాటానికి యితరదేశాల సహాయాన్ని అర్థించారు.

మహాసభలో శాంతిస్వాతంత్ర్యాలకోసం పోరాడేందుకు "ఫాసిస్టు వ్యతిరేక సంఘటనను" నిర్మించడానికి నిశ్చయిస్తూ ఏకగ్రీవంగా తీర్మానించారు. దేశంలోవున్న కమ్యూనిస్టు, వర్కర్, రైతు సోషలిస్టుపార్టీలు ఏకమై ఒక పార్టీగా నిర్మాణం కావాలనే తమ వాంఛను తెలియజేశారు.

ఫిబ్రవరి 5, 6 తేదీలలో జపాన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ విస్తృత సమావేశం టోక్యోనగరంలో జరిగింది.

గతపార్లమెంటుకి ఎన్నికల ఫలితాలను గురించి, జపాన్ పార్టీ పంథానుగురించి ప్రధాన కార్యదర్శి కామ్రేడ్ కుచీటోకుడా యిచ్చిన రిపోర్టుపై పరిపూర్ణమైన చర్చలు జరిగాయి.

ఆతరువాత పార్టీ తనపైవున్న బాధ్యతలను జయప్రదంగా నెరవేర్చేందుకు పార్టీని రాజకీయంగానూ నిర్మాణరీత్యాగానీ అభివృద్ధి చేసేందుకు కొన్ని నిర్ణయాలను తీసుకొన్నారు.

పార్టీసభ్యుల సిద్ధాంతస్థాయిని పెంపొందింప జేయడానికి కృషిచేయాలని తీర్మానించారు.

# ఇటలీ కమ్యూనిస్టుపార్టీలో సిద్ధాంతకృషి

“మార్క్సిజం ఒక మూఢసిద్ధాంతం కాదు. అది కార్యాచరణకు మార్గదర్శిని.” —స్టాలిన్

ప్రస్తుతం స్వదేశంలోనూ విదేశాలలోనూ వర్గపోరాటు తీవ్రత ఎక్కువవుతున్న యీ రోజులలో, ఆంగ్లోఅమెరికన్ సామ్రాజ్యవాదులు ప్రపంచాధిపత్యంకోసం అనేక కుట్రలు సలుపుతున్న, యీ సమయంలో ప్రపంచ శాంతిస్వాతంత్ర్యాలకూ, మానవజాతి పురోగమనానికి పోరాడేశక్తులకునాయకత్వం వహించుతున్న కమ్యూనిస్టుపార్టీలు రాజకీయంగానూ, నిర్మాణంగా బలపడవలసిన అత్యావశ్యకత నేడెంతో వుంది. ఇందుకు సభ్యుల మార్క్సిస్టు సిద్ధాంతపరిజ్ఞానాన్ని అభివృద్ధిచేయవలసివుంది.

ఈ దృష్టితోనే గత సెప్టెంబరులో జరిగిన ఇటలీ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ విస్తృత సమావేశంలో పార్టీలో సిద్ధాంతకృషిని ఎక్కువ చేయడానికి నిర్ణయాలను తీసుకొంది.

ప్రస్తుతం ఎదుర్కొంటున్న క్లిష్టసమస్యలను సరిగా అర్థంచేసుకొని పరిష్కరించగల శక్తి పార్టీసభ్యులకు వుండేందుకు వారికి మార్క్సిజం — లెనినిజంలో శిక్షణను యివ్వడానికి పార్టీ పూనుకొన్నది.

ఇందుకోసం కామ్రేడ్ టోగ్లియాటీ అధ్యక్షతను ఒక కేంద్రసిద్ధాంత కమీషన్‌ను ఏర్పాటుచేశారు. ఈ కమీషన్ శిక్షణనివ్వవలసిన సమస్యలపై సిలబస్‌ను తయారు చేయడానికి, స్కూళ్ళను నడపడానికి యితర సాంస్కృతిక కార్యక్రమాన్ని నిర్ణయించేందుకు కృషిచేస్తుంది.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ చరిత్రను ప్రతిసభ్యుడూ అధ్యయనం చేసేందుకు ఏర్పాట్లు చేశారు. ఈ గ్రంథం కమ్యూనిస్టుల సిద్ధాంత పరిజ్ఞానాన్ని పెంపొందింప జేయడానికి చక్కటి సాధనమని ఉద్దేశించబడి ఆ విధంగా ప్రకటించబడింది. ఇది అందరికీ ప్రధాన పాఠ్యగ్రంథంగా నిర్ణయించబడింది.

మార్క్సిజం — లెనినిజం సమస్యలపై కేంద్రకమిటీ వరుసగా ఉపన్యాసాలను ఏర్పాటుచేసింది. ఈ అధ్యయన కోర్సుకు 50 మంది విద్యార్థులు హాజరవుతున్నారు. ఇందులో కేంద్రకమిటీ సభ్యులూ, పార్లమెంటులోని పార్టీముఖ్యులూ వున్నారు. సాహిత్యమూ, చరిత్రా - అన్నింటినీ మార్క్సిస్టు - లెనినిస్టు దృష్టికోణంతో థీసిస్‌లను సభ్యులు సమిష్టిగా చర్చించి తయారు చేస్తున్నారు.

దేశమంతటా మార్క్సిజంలో పార్టీ సభ్యులకు శిక్షణను యివ్వడానికి స్కూళ్ళను నడుపుతున్నారు.

## ఇటలీలో కమ్యూనిస్టు పత్రికల అమ్మకం పెంపుదల

ఇటీవల ఇటలీ కమ్యూనిస్టుపార్టీ కమ్యూనిస్టు పత్రికల అమ్మకాన్ని ఎక్కువ చేయడానికి ఒక ఉద్యమాన్ని ప్రారంభించింది. రెండు వారాల్లోనే దాని ఫలితాలు కనపడినాయి.

“లా యూనిటా” అనే కమ్యూనిస్టు దినపత్రిక మిలాన్ ఎడిషన్ అమ్మకం ఒక లక్ష యేబదివేల కాపీలనుండి 3 లక్షల ముప్ఫయి వేల కాపీలకు పెరిగింది. ఈ పత్రిక యొక్క రోమ్ ఎడిషన్ అమ్మకం 8 వేలకు పెరిగింది.

ప్రజల, పార్టీకార్యకర్తల సిద్ధాంత స్థాయిని పెంచడానికి పత్రికలవ్యాప్తి పెరగడం ఎంత ముఖ్యావసరమో కామ్రేడ్ టోగ్లియాటీ నొక్కి వివరించాడు.

# ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీలో సిద్ధాంతకృషి

ఫ్రెంచికమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ తన పార్టీ సభ్యులకు సిద్ధాంతంగానూ, రాజకీయంగా తర్ఫీదునిచ్చే విషయంలో ఎల్లప్పుడూ అత్యంత శ్రద్ధను పాటించుతూనే ఉంది.

ఉదాహరణకు 1939 సెప్టెంబరు నుండి 1944 సెప్టెంబరు వరకూ పార్టీకి చాల గడ్డు దినాలు. పార్టీ రహస్యంగా పనిచేస్తూ ప్రతి ఘటనా పోరాటంలో ప్రజలను సమీకరించవలసిన రోజులు అయినా పార్టీనాయకత్వం సిద్ధాంత కృషి విషయంలో లోటు జరగడానికి యిష్టపడలేదు. ఆ విపరీత విపత్కర పరిస్థితులలో సహితం పొలిట్‌బ్యూరో అత్యంత శ్రద్ధ తీసుకొని అధ్యయన కేంద్రాలను నడిపింది. రహస్య దినాలలో - ఆనాడు ఫ్రాన్సులోవున్న పరిస్థితులలో అధ్యయన కేంద్రాలను జరపడం ఎంతకష్టమోవూహించుకోవచ్చు. “సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చరిత్ర”నూ, ఇతరమార్క్సిస్టు లెనినిస్టు ప్రమాణ గ్రంథాలనూ తక్కువ ధరలకు ప్రచురించింది. ఇంకా అనేక సిద్ధాంత సమస్యలపై సామాగ్రిని తయారుచేసి పార్టీ సభ్యులకు అందజేశారు.

1947 లో జరిగిన పార్టీ కాంగ్రెసులో మార్క్సిజం - లెనినిజాన్ని అధ్యయనం చేయడం విషయంలో ఎక్కువ శ్రద్ధ తీసుకోవలసిన ఆవశ్యకతనుగురించి కామ్రేడ్ మారిస్ థోరే ప్రసంగిస్తూ యిలా అన్నాడు.

“పార్టీలోని సభ్యులంతా సిద్ధాంతాలను అధ్యయనం చేసేందుకు ఎక్కువ అవకాశాలు కలిగేటట్టునుచూడవలసి వుంది. ముఖ్యంగా పార్టీలో ప్రధాన స్థానాలలోవుండి, దైనందిన పని వొత్తిడితో సతమతమవుతున్న కార్యకర్తలు సిద్ధాంత పరిజ్ఞానం తగినంత లేనిపక్షంలో సిద్ధాంతంతో సంబంధంలేని సంకుచిత ఆచరణ కార్యక్రమాలలో మునిగిపోవడమనే ప్రమాదం వుంది.”

1947 సెప్టెంబరునుండి మూడు నాలుగు మాసాలు స్కూళ్ళు జరిగాయి. ఇటీవల జరిగిన స్కూలులో 96 గురుపార్టీసభ్యులకు శిక్షణను యివ్వడం జరిగింది. ఈ 96 గురులో కేంద్ర కమిటి సభ్యులూ, ప్రజాసంస్థలలోని పార్టీ నాయకులూ పార్లమెంటులోని కమ్యూనిస్టు ప్రముఖులూ వున్నారు.

ఈ స్కూళ్ళలో సిద్ధాంత, ఆచరణలను గురించీ పాఠాలు చెప్పబడతాయి. ముఖ్యంగా



నేటి ప్రపంచ విప్లవశక్తులను గురించీ, సాంఘికాభివృద్ధికి సంబంధించిన శాస్త్రీయ సూత్రాలనుగురించీ మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలించి ఉద్యమాలలో ప్రత్యక్షంగా పాల్గొన్న అనుభవంతో వ్రాసే విశ్వవిఖ్యాత మార్క్సిస్టుల వ్యాసాలనూ, రచనలనూ అనేక ప్రత్యేక పత్రికలనుండి ఏరి పక్షంపక్షం జనత ప్రచురిస్తోంది.

గ్రంథాలయాలలోనూ, వ్యక్తుల స్వంత లైబ్రరీలలోనూ, ప్రజా సంస్థల కార్యాలయాలలోనూ 'జనత' పత్రిక లన్నింటినీ జాగ్రత్త చేసుకొనేందుకు చాలమంది ప్రయత్నించుతున్నారు. వెనుకటి సంచికలకోసం — వాటిలోవుండే వ్యాసాల వివరాలను తెలియజేయమని మాకార్యాలయానికి వ్రాస్తున్నారు. మావద్ద ప్రథమసంచిక తప్ప, తతిమ్మా సంచికలన్నీ కొద్దిగా మాత్రమే ఉన్నాయి. కాబట్టి ఫైల్సులోకీ, గ్రంథాలయాలలోకీ సంచికలు కావలసినవారు త్వరపడి ఆర్డరు పంపించవలసిందిగా కోరుతున్నాము. వివిధ సంచికల్లో ఇప్పటివరకూ వచ్చిన ముఖ్యవ్యాసాలను పాఠకుల సౌకర్యార్థం యీ క్రింద ఇస్తున్నాం.

## సంచిక 1

1. హంగేరి కమ్యూనిస్టుపార్టీలో సిద్ధాంత కృషి

—మాటియాస్ రాకోసి

2. యుగోస్లావియా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంపై కొమిన్ ఫారం తీర్మానపాఠం

3. చైనా విముక్తియుద్ధ సమీక్ష

4. మార్క్సిజానికి యుగోస్లోవియా కమ్యూనిస్టుపార్టీ స్వస్తి

—ఐ. లొట్

5. ప్రజల పొట్టకొట్టేందుకు రాబందులన్నీ చేరాయి. (నోట్ల ముమ్మరం)

6. ప్రపంచ దురాక్రమణకు అమెరికా ఎత్తులు

—విలియం ఫాస్టర్

ముఖచిత్రం - కారల్ మార్క్సు

## సంచిక 2 1–11–1948

1. యుగోస్లోవియా కమ్యూనిస్టుపార్టీ నాయకుల మార్క్సిస్టు వ్యతిరేకపంథా

—చర్బొంటియర్

2. విముక్తచైనాలో వ్యవసాయసంస్కరణ

—లెక్‌పిషి

3. ఆత్మవిమర్శ కమ్యూనిస్టుపార్టీ ప్రధానాయుధం (కొమిన్ ఫారం సంపాదకీయం)

## సంచిక 3 15-11-1948



## సంచిక 4 1-12-1948



## సంచిక 5 15-12-48



## సంచిక 6 1-1-1949

6. పోలండ్ కమ్యూనిస్టుపార్టీలో మిత వాద జాతీయపోకడలు

—(పోలండ్ కమ్యూనిస్టుపార్టీ తీర్మానం)

7. కమ్యూనిస్టు సమాజ నిర్మాణంకోసం సోవియట్ ప్రజల పురోగమనం

—పి. యూడిన్

8. ఫ్రెంచి ఇండియా సమస్యపై భారత కమ్యూనిస్టుపార్టీ ప్రకటన

ముఖచిత్రం - జదనోవ్

# సంచిక 7 15-1-1949

1. సోవియట్ యూనియన్‌కు అనుకూలమా? ప్రతికూలమా?

—ఓ. కూసినెన్

2. ప్రకృతి శక్తులపై సోవియట్ సాధించిన మహత్తర విజయం

3. ఫ్రెంచి సాహిత్యం ప్రజాసమరానికి ప్రతిబింబం

—వీ. నికోలయేవ్

4. బ్రిటిషు సోషలిజంలోని బండారం

—ఎ. లియోనిడోవ్

5. సోషలిజంవైపుకు ప్రజాతంత్రపోలండ్ పురోగమనం

—విజయ

# సంచిక 8 1-2-1949

1. ప్రజాస్వామిక ప్రజాతంత్రం

2. వ్యవసాయ సమస్య

భారత విప్లవపోరాటం

3. భారతదేశంలో కాంగ్రెసు ప్రభుత్వం

—ఎ. డైకోవ్

# సంచిక 9 15-2-49

1. నిర్మాణ కృషి

—కొమిన్‌ఫారం సంపాదకీయం

2. పెట్టుబడిదారీ విధానంలో తీవ్రతర సంక్షోభం

—ప్రొఫెసర్ ఎ. శ్నియర్సన్

3. తెలంగాణావిప్లవం భారత ప్రజల కర్తవ్యం

4. బల్గేరియా కమ్యూనిస్టుపార్టీ 5 వ కాంగ్రెసులో కామ్రేడ్ డిమిట్రోవ్ రిపోర్టు

5. బూర్జువా జాతీయత

—కొమిన్‌ఫారం సంపాదకీయం

# సంచిక 10 1-3-49

1. 1948 లో ప్రజాతంత్రశక్తుల పురోగమనం

—కొమిన్‌ఫారం పత్రిక సంపాదకీయం

2. భారతదేశంలో పెట్టుబడిదారీ ప్రభుత్వం

—డైకోవ్

3. సోవియట్ స్వాధీనంలోవున్న జర్మనీలో వ్యవసాయసంస్కరణలు

—జి. ఖరఖష్యాన్

4. ప్రజాస్వామిక విధానంపై కామ్రేడ్ లెనిన్

—వి. నెమిరోవ్‌స్కీ

5. వ్యవసాయసమస్య - లెనిన్

6. బర్మాజాతీయసత్వానికి లేబరుసామ్రాజ్యవాదుల వ్యూహం

—ఎ. లియోనిడోవ్

7. సోవియట్ విదేశాంగనీతి

సమిష్టిచర్చకోసం నోట్సు



యీ క్రిందివాటిపై పాఠాలను కేంద్రీకరించుతారు.

(1) సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ (2) ఫ్రాన్సు చరిత్ర (3) ఫ్రెంచి కార్మికోద్యమ చరిత్ర (4) ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (5) అర్థశాస్త్రం (6) పార్టీ నిర్మాణం (7) స్టాలిన్ రచించిన "గతితార్కిక భౌతికవాదం, చారిత్రాత్మక భౌతికవాదం" అగ్రంధాన్ని ఆధారం చేసుకొన్న తత్వశాస్త్రం.

ఇదే కాలంలో 11 నాలుగు వారాల స్కూల్లు కూడా జరిగాయి. ఇందులో కార్మిక కర్షక, మహిళా, యువజన ఉద్యమాలలో చురుకుగా పాల్గొనే పార్టీసభ్యులకు శిక్షణను యిచ్చారు.

ఇవిగాక జర్నలిస్టుల కోసం (పత్రికా రచయితలు) మూడు మాసాలు స్కూలును ప్రత్యేకంగా పెట్టారు. ఈ స్కూలులో పారిస్ నుండి రాష్ట్రాలనుండి వచ్చిన 29 పార్టీపత్రికలలో పనిచేసే రచయితలకు మార్క్సిజం - లెనినిజం సిద్ధాంతంలో శిక్షణను యిచ్చారు.

అన్ని స్కూళ్ళలోను మార్క్సిజం - లెనినిజంను బోధించడానికి స్టాలిన్ చే రచించబడిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చరిత్రనే ఆధారం చేసుకొంటున్నారు ఈ గ్రంధాన్ని అధ్యాయం తరవాత అధ్యాయాన్ని తీసుకొని అధ్యయనం చేస్తారు.

1947 అక్టోబరునుండి 1948 సెప్టెంబరు వరకు 129 శాశ్వత రెండు వారాల స్కూళ్ళు పార్టీ ఫెడరేషన్ల అధ్వర్యాన జరిగాయి. ఈ స్కూళ్ళకు మొత్తం 2071 విద్యార్థులు హాజరయ్యారు.

1948వ సంవత్సరం మొదటి అనుమాసాలలో 777 ప్రాధమిక స్కూళ్ళలో 6344పార్టీ సభ్యులు శిక్షణను పొందారు. ఈస్కూళ్ళలో చెప్పిన పాఠాలను పుస్తకం రూపంలో ఒక లక్ష కాపీలను ప్రచురించారు.

ఈ విధంగా ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీలో సిద్ధాంత కృషికి అత్యధిక ప్రాముఖ్యత యివ్వబడుతోంది.

---

మాస్కో రేడియో ప్రసారం

## భారతీయ శ్రోతలకోసం క్రొత్తప్రోగ్రాం

| భాష | కాలం | మీటర్లు |
|---|---|---|
| హిందూస్తాని | సా॥ 5-30 నుండి 6-0 | 19-56 |
| ఇంగ్లీషు | సా॥ 6-0 నుండి 6-30 | 30-96 |

వార్తలపై వ్యాఖ్యానం, అంతర్జాతీయ పరిస్థితులపైనా సోవియట్ యూనియన్‌లో జీవితవిధానాన్ని గురించీ ప్రసంగాలుంటాయి.

# గ్రంథస్వీకారం



## చైనా విప్లవచరిత్ర

[ జాతీయ సోవియట్ విప్లవదశలు ]

రచన : నిడమర్తి అశ్వనీకుమారదత్తు

వెల : నాలుగు రూపాయలు

ప్రచురణ :

ప్రగతి ప్రచురణాలయం — నిడమర్రు

(వయా) పెంటపాడు, పశ్చిమగోదావరిజిల్లా.

***

## ఫ్రెడరిక్ ఎంగిల్సు

## జీవితం : ఉపదేశాలు

రచన : వి. ఐ. లెనిన్

అనువాద : నిడమర్తి ఉమారాజేశ్వరరావు

వెల : ఒక రూపాయి

ప్రచురణ : ప్రగతి ప్రచురణాలయం

నిడమర్రు

(వయా) పెంటపాడు పశ్చిమగోదావరిజిల్లా.

***

## శిలాసింహం

(నాటకం)

రచన :- ఇల్యా ఎహ్రెన్ బర్గ్

అనువాదం :- రామారావు

వెల : రూపాయి పావలా

ప్రతులకు : లీలా బుక్ డిపో విజయవాడ

# తప్పొప్పుల పట్టిక

[ నేటి రివిజనిజానికి ప్రతికూల పోరాటం - అనే వ్యాసంలోని తప్పొప్పుల వివరణ ]

| పేజీ | పంక్తి | పొరపాటు | సవరణ |
|---|---|---|---|
| 8 | 18 | కలిసి | (ఆ పదాన్ని తీసివేయాలి) |
| 4 | r | లెనిన్ దే | లేనిదే, |
| 4 | 19_22 | కాట్స్కా | కాట్స్కీ |
| 4 | 23 | తాత్కాలిక | పరివర్తనదశలో |
| 9 | 9 | మధ్యసమస్యగా | మధ్యగల సమస్యగా |
| 9 | 23_24 | (ఆ రెండుపంక్తులు తీసివేసి ఆస్థానే) | వెనుకటిపాలసీ కొనసాగించడంగానే చెప్పుకోవడం సంభవించింది |
| 12 | 3 | మాత్రం అభివృద్ధిచేయడం | మాత్రమే తయారుచేయడం |
| 13 | 6 | నిముష నిముషం | మెల్లమెల్లగా |
| 15 | 28 | శ్రామికవర్గ రాజకీయాలు | శ్రామికవర్గంగా |
| 16 | 1 | అవలబించాలని | తయారవాలని |
| 24 | 25 | సంఘంలోనే | సాంఘికవిధానంలోనే |
| 24 | 23 | బూర్జువా వ్యతిరేకతతో | బూర్జువా ప్రతికూలపక్షంలాగా |
| 26 | 2 | వీలవుతూ | వీలవుతుంది |

[ తక్కిన్నా అచ్చుతప్పులను పాఠకులు సందర్భాన్నిబట్టి సవరించుకో గోరతాం. (సం) ]

